(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు)



పేరు : ఆర్. హనుమంత్ సింగ్

వృత్తి : గ్రేడ్ II హిందీ పండితులు

కార్యక్షేత్రం : శ్రీ వెంకటేశ్వర హిందీ విద్యాలయం. తిరుపతి

అర్హతలు - ఎమ్. ఎ, సా రత్న,

అభిరుచి : కవితలు వ్రాయుట, ఆధ్యాత్మిక చింతన, హిందీ ప్రచారం, పరిచయ పరీక్షనందు ప్రత్యేక కృషి.

చిరునామా : సి. టైప్: ఇంటి నెం. 41, వినాయక నగర్, కె.టి. రోడ్, తిరుపతి (పోష్టు) చిత్తూరుజిల్లా.



పేరు : కుమారి మకుటం లక్ష్మి దేవసేన

వృత్తి : హిందీ పండితులు

కేంద్రం : సూళ్ళూరు పేట

అర్హతలు : ప్రవీణ, ప్రచారక్, బి. ఏ. సెకండ్ ఇయర్

జన్మస్థానం : సూళ్ళూరు పేట

జన్మతేది : 13-7-1963

అభిరుచి : హిందీ, తెలుగులో కవితలు వ్రాయుట, సాంస్కృతిక కార్యక్రమాలు, నాటకాలలో పాల్గొనుట,హిందీ ప్రచారం, మరియు పరిచయపరీక్షనందు ప్రత్యేక కృషి.

చిరునామా : C/o M.ఓబయ్య, రాఘవయ్య పేట, సూళ్ళూరుపేట (పోష్టు) నెల్లూరు జిల్లా.



పేరు : ధర్మవరపు హరిబాబు

వృత్తి : గ్రేడు II హిందీ పండితులు

కార్యక్షేత్రం : S.U.P. స్కూలు, కాకానివారి పాలెం

అర్హతలు : రా. భా. విశారద, సా. విశారద, హిందీపండిట్ ట్రైనింగ్. SSLC

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయపరీక్ష నందు ప్రత్యేక కృషి, సంగీత నాటక, వైద్యకళలందు అభిరుచి.

చిరునామా : P.S.U.P.స్కూలు, కాకానివారిపాలెం (పోష్టు) అద్దంకి తా ప్రకాశం జిల్లా.



సాహిత్య మాస పత్రిక

# 365, 366

సెప్టెంబరు, అక్టోబరు 1984

సంపుటి : 81, సంచిక 6,7

వార్షిక చందా : పదిహేను రూపాయిలు

విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు:

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఈ సంచికలో

సంపాదకీయం

# అక్టోబర్ 2

అక్టోబర్ 2...

భారత జాతికే దు, యావత్ ప్రపంచానికే అది చరిత్రాత్మక దినం. భారతీయులకిది చిరస్మరణీయం. ఇద్దరు త్యాగమూర్తులకిది జన్మదినం. ఒకరు మహాత్మాగాంధీ, రెండవవారు శ్రీమాజీ ప్రధాని శ్రీలాల్‌బహాదుర్‌శాస్త్రి. ఒకరు మహాత్ముడై మానవజాతి మనుగడయొక్క విలువల్ని ఎత్తిచూపగా మరొకరు రాజకీయాలలో త్యాగంకూడా ఒకభాగమని తన ఆచరణతో ఋజువు చేసి భారతదేశపు అత్యున్నత అధికారపదవి (ప్రధానమంత్రి)కి అర్హత సంపాదించుకొన్న త్యాగశీలి. అందుకే అక్టోబరు 2 భారతీయులకు అత్యంత ప్రియతమమైనది.

అక్టోబరు 2... ప్రతి సంవత్సరమూ వస్తూనే వుంది. ఆరోజు మాత్రం మహాత్మా గాంధీ పత్రికల్లో కనిపిస్తున్నాడు. ఆయన విగ్రహం ఉన్నచోట దానిమెడలో ఒక పూలదండ పడుతూంది. ఆంతటితో మనకర్తవ్యం ముగిసినట్లుగా ఆయనని మరచిపోవడం జరుగుతూంది. 30 యేళ్లపాటు భారతీయ జన జీవితాన్ని ఆక్రమించుకొని మానవజీవితానికి ఒక నూతనఅర్థం, విలువ కల్పించి అవగతమైవున్న జాతినైతిక స్థాయిని ఉన్నత శిఖరాలకు చేర్చడానికి జీవిత పర్యంతమూ కృషిచేసిన ఆ మానవతామూర్తిని మరొక 37 యేళ్లు గడిచేసరికి మరచిపోయే స్థితికి భారతజాతి దిగజారడం దాని నైతిక పతనాన్నే సూచిస్తుంది.

అయితే మహాత్ముని జీవితంగాని, ఆయన ఉపదేశాలుగాని, ఆయన సాధించిన విజయాలుగాని అంత తొందరగా మరచిపోదగినంత బలహీనమైనవా ? కాదు. ఒక ఉన్నతమైన వస్తువుయొక్క స్వరూపాన్ని చూడాలంటే తగినంత దూరంనుంచి ఆ వస్తువుని చూచినప్పుడే అదిసాధ్యమవుతుంది. అలాగే మహాత్మాగాంధీ విలువల్ని అర్థంచేసుకోవటానికి కూడా తగినంత వ్యవధి అవసరమనిపిస్తుంది. ఆయన జీవిత కాలంలోకంటే 37 యేళ్ల తరువాత నేడాయన సిద్ధాంతాలు విశ్వవ్యాప్తమైనాయి. ప్రపంచం ఆయన సిద్ధాంతాల విలువలను గుర్తించడం ప్రారంభించింది.

గుర్తించనిది ఒక భారతదేశమే. ఆయన ఉపదేశాలకు వారసులమని చెప్పుకొన్న అనేకమంది నాయకులు పదవులలోకి వచ్చిన తరువాత ఆ ఉప

దేశాలను గాలికివదిలివేశారు. తన జీవితాన్నే ఒక ప్రయోగశాలగా మార్చి భారత దేశానికి, అట్టడుగున పడివున్న భారత ప్రజానీకానికి అభ్యుదయ మార్గాలను అన్వేషించారు. ఆ నిరంతరాన్వేషణ ఫలితమే ఆయన మనకు చూపించిన మార్గాలు.

నూటికి 80 మంది నివసిస్తూన్న గ్రామాన్ని మన అభివృద్ధి కృషికి కేంద్రాలుగా నిర్మించమని తన ఆచరణ ద్వారా మనకు ఆయన ఉపదేశించారు. ఖాదీ, నూనెగానుగలు వంటి చిన్నపరిశ్రమలకు ఆయన అత్యంత ప్రాధాన్యం యివ్వడం యిందుకు తార్కాణం. అయితే మనపెద్దలు ఆయన అనుభవాన్ని తోసి భారీ పరిశ్రమలకే ప్రాధాన్యమిచ్చి వాటికి కావలసిన యంత్ర సామగ్రిని విదేశాలనుంచి దిగుమతి చేసుకొని అందుకు కావలసిన ధనాన్ని కూడా యితర దేశాలనే భిక్షమడిగి తెచ్చిదేశంలో పెట్టుదారీ విధానాన్ని, దేశంలో పెట్టుబడిదారుల్ని పెంచి పోషించారు. అదేమంటే దేశంలోభారీయంత్రాల ద్వారా భారీగా ఉత్పత్తిని పెంచుతున్నామన్నారు. దానిఫలితంగా గ్రామాల్లోని బడుగు ప్రజల అభ్యున్నతికి బదులుగా పట్టణాలు, పట్టణాల్లోని పెట్టుబడిదార్లు మాత్రమే తమ సంపదని విపరీతంగా పెంచుకొన్నారు.

భారతీయ జన జీవనానికి రైతు జీవకర్ర. వాస్తవమైన దేశాభివృద్ధి వ్యవసాయాభ్యివృద్ధివల్లనే సాధ్యమవుతుందని గాంధీజీ పదేపదే హెచ్చరించగా అదికూడా మనవాళ్లకు రుచించలేదు. ఒక్క మొదటిపంచవర్ష ప్రణాళికలో మాత్రం వ్యవసాయానికి45శాతం ప్రణాళికా వ్యయాన్ని అంగీకరించి ఆ తరువాత తన పంథాని మార్చుకొని వ్యవసాయాభివృద్ధికి నిధులను 22 శాతానికి కుదించి వేసింది మన ప్రభుత్వం.ఇది స్పష్టంగా గాంధీవాదానికి తిలోదకాలివ్వడమేకాదా? నూటికి 80 శాతంప్రజల అభివృద్ధికి కేవలం 22శాతం నిధులు, నూటికి 20శాతం మాత్రమే నివసిస్తూన్న పట్టణాలకు 78శాతం నిధులు ఖర్చుపెట్టి భారీపరిశ్రమల్ని పెంచి, పెట్టుబడిదారుల పొట్టలుపెంచి దేశ సంపదనీ పెంచామనీ, అభివృద్ధి సాధించామనీ సంతృప్తి పడుతున్నారు మనపెద్దలు.

అయితే యిన్ని సంవత్సరాల తరువాత యిందులోని తప్పిదాన్ని గ్రహించారు ప్రజలు. గాంధీజీబోధనలోని వాస్తవాలు యిప్పుడు ప్రజలవత్తిడి వల్ల పాలకులకు కూడా కనువిప్పు కలుగుతూంది. అందువల్ల మహాత్మాగాంధీ సిద్ధాంతాల ఆవశ్యకత రానున్న తరాలవారికి మరింతగా అర్థం అవుతుందనడంలో సందేహంలేదు.

20వ శతాబ్దం మార్క్సుది కాగా 21వ శతాబ్దం గాంధీదన్న ఒక తత్త్వవేత్త ప్రవచనం వ్యర్థం కాబోదు.

# నేతాజీ కాళోజీ

— వి. రాములు

కాళోజీ
ఎవరని అడుగుతున్నారా?
అతడు
మా నేతాజీ-
మా ప్రియతమనాయకు డండీ
అతడు
మా చరిత్ర
మొద్దునిద్దరలో పడిఉన్న మాజాతిని లేపిన
వైతాళికుడు
మాస్వాతంత్ర్యోద్యమ సారథి
అతడి కలం
మాసమరపథంలో నడ్చిన; నడుస్తున్న
ఏకైకశతఘ్ని
అతడు
మావిప్లవ కెరటాలహోరు
మామండే గుండెల సెగ
ఇవ్వాళ
మేమింతటి చైతన్యుల మంటే
'కాళోజీ' అనే ఒక మహాశక్తి
మా ప్రతి ఒక్కరి లోనూ ఆవహించడం వల్ల
అతడు-
మా ఊపిరి,
మా ధైర్యం,
మా శౌర్యం,
మా దుర్గం,
మా మార్గం,
మా గీతం,
మా వేదం
మా సర్వం
అంతే గాదు
ఒక్కమాకేగాదు
అతడు మీ అందరికీ ఆత్మబంధువే
మీ అందరి కన్నీళ్ళూ అతడికన్నీళ్ళు
అతడు
ప్రజల మనిషి
ప్రజాకవి
అంటే ప్రపంచకవి

(1980 మధుమంజరిలో ప్రచురితం)

# తెలుగు ఒయాసిస్సు

—డా. తంగిరాల వెంకట సుబ్బారావు

వంకర చేతికర్రవంటి బక్కపలుచని ఒళ్ళు
తెలుగు వెలుగును పుక్కిలించే చెంపకుచారెడుకళ్ళు

కొంగరెక్కవంటి తెల్లటిచొక్కా
మల్లెపువ్వువంటి తెల్లటిలుంగీ
ఆరవకట్టు తెలుగుబొట్టు
తొట్టి పడవలా తడబడే నడక
రాయల పరిశోధన భారంతో వంగిన శిరస్సు

రానురానుపైబడుతున్న వయస్సును లెక్కించని హుమ్మస్సు

ఓహో ! ఈకోదండరామయ్యకేయస్సు
హోసూరు తెలుగు సోదరుల ఒయాసిస్సు !

అశోకవనంలో ఏడుస్తున్నసీత ఇక్కడి ఆంధ్రమాత
అహంకారం అన్న తన్నుతిన్న తమ్ముడు విభీషణుడు
ఇక్కడి తెలుగుభాషణుడు
రావణసభలో బ్రహ్మాస్త్రబంధితుడు వీరహనుమానుడు
ఇక్కడి ఆంధ్రాభిమానుడు

ఓ **కోదండ**రామా !

నిత్యం నీ నామాన్ని జపిస్తోంది సీత
నీ శరణుకోసం వస్తున్నాడు దిక్కులేని విభీషణుడు
లంకాదహనం కోసం ఎదురుచూస్తున్నాడు కుపిత అంజనీసుతుడు

ఓ కేయస్కే !

నీచక్రాలవంటికళ్ళల్లో నిగూఢంగాదాగివున్న తెలుగు తేజస్సు చెరలాటం !
నీబక్కచిక్కిన శరీరంలో నక్కిన తెలుగు పౌరుషపు ఆరాటం !

ఏడుపదులు పైబడిన నీబడుగు బ్రతుకంతా పరుచుకున్న
తెలుగువ్యక్తిత్వపు పోరాటం.
ఇంతమందిని అనాథల్ని చేసి ఎక్కడికి వెళ్ళావు కేయస్సూ ?
సేనానిలేని ఈతెలుగువాహినికి ఇకఎక్కడుంది శ్రేయస్సు ?
నీలాంటి స్వాభిమానధురంధరుల్ని చూసే రాశాడు శేషేంద్ర
"సముద్రం ఒకటి కాళ్ళదగ్గరనిలబడిచిత్తం అనదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు"
ఇది నీ త్యాగజీవిత సమాధికి మంచి ఎపిటాఫ్ !
ఇక ముందు ఇదేమాకు చీకటిలో దారిచూపే చిరుదివ్వె, హేట్సాఫ్

[హైదరాబాదులో అంతర్జాతీయ తెలుగుసంస్థలో జూన్ 4వతేదీని ఆకస్మాత్తుగా పరమపదించిన హోసూరు 'తెనుగు తెంక' శ్రీ కె. యస్. కోదండ రామయ్యగారిని తలచుకొని......]

# కావ్య కన్య

"కవితాభూషణ" ఎం. పి. జానుకవి

అద్దము ముందునిల్చి, తనయందము చందములెల్లజూచి, ము
ప్పొద్దులుతీపితీపి తలపుల్ వలపుల్ సెగలౌచు కాల్చగా
నిద్దురరాక నెమ్మదిని నిండిన కాంతుని రాకకోసమై
ముద్దులు మూటగట్టు నొకముద్దియ కావలె కావ్య కన్యయున్ !

గజ్జలు మ్రోయ, చన్నుగవకంపము నొందవనాంతరాన
పూసజ్జను వీడిలేనడుము సారెకునల్లల లాడుచుండగా
సజ్జన మానసంబుగతి సాగుచు నూత్న విలాసశోభలన్
ముజ్జగ మేలగల్గు నవమోహిని కావలెకావ్య కన్యయున్!

పలుకులు తేనె చిన్కులయి, పాదములన్ మురిపించుకుల్కుటం
దెలునవనాదమై చెలగ, నెమ్మదిదో చెడి హావభావముల్
వలపులు రేపగా, సుజన వందితయై హృదయాంక పీఠముల్
కొలువుగ నిల్చునట్టి సుమకోమలి కావలె కావ్యకన్యయున్ !

బంగరు మేనితోడ, తడబాటు తెలుంగని పల్కుతోడస
న్మంగళ మూర్తియై, నిరుపమాన కళానిలయంబు పోలికన్
ముంగిటిలోన నిల్చి యరమోడ్పుకనుంగవ తోరసజ్జలు
పొంగగస్వాగతంబ నెడు మోహిని కావలె కావ్యకన్యయున్ !

సుందర మందహాస నవశోభలనీను ముఖాంబుజంబుపై
నందముచిందులాడ. కురులల్లన గాలికి తేలియాడగా
నందెలు ఘల్లనంగ, సరసాంగి విధంబున జేరవచ్చి, పూ
లందుకొనుండటంచు వినయంబున బల్కెదె కావ్యకన్యయున్

# కేశోపాఖ్యానం

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

పోతే పోయింది, వెంట్రుకాయిది! అని,
వెంట్రుకనుచుల కనగా చూడడం పరిపాటి; అల్లాగే -
కొండకు వెంట్రుకను కట్టాను, వచ్చిందా కొండ వస్తుంది,
పోతే పోయేది వెంట్రుకేగా! అని, అనడం కూడా పరిపాటే!
అయితే, వెంట్రుకను చులకనగా చూడడం న్యాయం కాదు;
స్త్రీల విషయం అల్లా ఉంచి-
పురుషులుకూడా కేశాలకు ఎంతో సంస్కారం చేసుకుంటారు.
అర్జునుడివి, తెగబారెడు వెంట్రుకలన్నాడు, చేమకూర!
రాయలకాలంలో-
అగురు ధూపం వేసుకొని, పరిమళ తైలంతో సంస్కారం చేసుకొని
పూలనుకూడా ధరించడం, ఒక ఫాషన్!
కాలక్రమేణా, కత్తిరింపులు వచ్చినా
హిప్పీలను అనుకరించేవారు కేశాలమీద ఎంతో శ్రద్ధ వహిస్తున్నారు.
క్షౌరశాలలో వాటి సంస్కారం తద్దినంపెట్టినంతకాలం హరిస్తుంది.
పలితకేశం వార్ధక్యానికి చిహ్నం!
అందానికి ప్రతిబంధకం!
పలితకేశాన్ని గురించి 'దువ్వూరి' కావ్యమే వ్రాసి పారేశారు!
అయితే-
నరసిన వెంట్రుకలకు నల్లరంగు వేసి
తళతళలాడించే వారున్నారు
అల్లాంటి వారికి గొంతుకాన్సర్ రావచ్చునని
డాక్టర్లు అంటున్నారు!
మహనీయుల వెంట్రుకలను తెల్లనివయినా

నల్లనివయినా
పవిత్ర స్మృతి చిహ్నంగా భావిస్తారు.
మహమ్మదు ప్రవక్త వెంట్రుక కోసం, అదిపోతే-
ప్రభుత్వం, దానిని గాలించిపట్టుకొని
దానిని మసీదులో పునః ప్రతిష్ఠితం చేసేదాకా
నిద్దుర పోలేదు-
ఆకాశం ప్రతిష్ఠా హేతువుకనుక
చారిత్రికంగా కూడా వెంట్రుక కెంతో విలువ ఉంది.
నెపోలియన్ చిన్న వెంట్రుకను వేలం వేస్తే
పాతిక వేల రూపాయలు వర్షించినై-
కనుక, వెంట్రుక విలువ, అంతా యింతానా?

పైడిపాటి సుబ్బరామశాస్త్రి
పైడిపాటినగర్
విజయవాడ -4

# ఒకేజాతి ఒకే ప్రజ

పోతుకూచి సాంబశివరావు

ఎన్ని నదులుద్భవించినా
ఎత్తు పల్లాలపారి
సాగరులో కలిసి పోతాయి.
ఎన్ని కొమ్మలు, రెమ్మలు, ఆకులు తొడిగినా
వృక్షం అందిస్తుంది
ఒకే రకం, పూలు, ఫలాలు.
ఎన్ని తారలు, గ్రహాలు
రోదసిలో ఊగినా
అన్ని ఒకే వెలుగులో కేంద్రీకృతం.
కులమతాలు, వర్ణ సముదాయాలు
వేరుగా చరిత్రలో మిగిలినా
మానవ జాతి ఒకటన్నది సత్యం,
బహు భాషల బహు జాతుల
పరిధి పరిశీలింప దేశపరిమితం.
ఏ దేశ చరిత్ర ఎంత చూసినా
ఏ మున్నది? మానవజాతి జీవిత కథనమే.
ఏడు రంగులు వెదజల్లినా
అన్ని కలిసిన ఇనుని తెలుపుకిరణమే,
ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థలో
భారత జాతే భారత ప్రజా అంగ వంగ కళింగ
రాజ్యాల కాలం మారింది.
రాజ్యాల స్థానంలో
రాష్ట్రాలు నిలుచున్నాయి.
రాష్ట్రాలు రాజ్యాలుగా
భావించే ఎండమావులు
అధికారదాహం తీర్చలేవు.
గుండెను కోస్తే, ఎంత కాలం
దేహం జీవంతో నిలుస్తుంది?
అధికార స్వార్థ కిరీటాలకై
దేశం గుండెను కోయబోకు
మతాలు పేరిట, గతాలు మరవకు
దండ యాత్రల నెగ్గిన రాజ్యాలు
బండరాళ్ళుగా మారాయి.
గుడిలో గంటలు మ్రోగాలి కాని
గుండెలు స్రవించే రక్తపాతం కాదు
ఏ దేవుడూ నీకు ద్వేషం కావాలనడు.
నీ హృదయంలో అర్చన పదంటాడు.
కత్తులు చిత్తాలను సంస్కరించ లేవు
మారణహోమం మానవ కళ్యాణం కాదు.
రంగు రంగుల వస్త్రాలు
గాలికి రెపరెపలాడుతూంటే
ఆ సర్వ వర్ణ పతకాల రవళి
మానవ హృదయ జీవన సరళి
రకరకాల పూల రంగుల వదనాలు
చిరుగాలి కదలికల పలకరిస్తూంటే
ఏవో భావాల రాగాల ఆనంద డోలల్లో
హృదయ పుష్పాలు వికసించి తన్మయత
లీనమౌతాయి.

ఒకేజాతి-ఒకే ప్రజ నినాదం
సర్వ మానవ సమానత్వ తత్వనాదం
తలపాగా ఉంటేనేం, టోపీ ఉంటేనేం ?
తలపుల పాగాపై టోపీపెట్టరాదు.
ఆలోచనలు గాలిలో ఆవిరిగా తేలాలి
అనంత స్వేచ్ఛతో ఆడుకోవాలి.
దిక్కులు నాలుగు, యింకా చూస్తే ఎనిమిది
తరచి తరచి పరిశీలిస్తే పది.
ఈ అనంత భూమ్యాకాశవలయంలో
దిక్కులుచూసి బిక్కుబిక్కు మనకు
ఏ దిక్కులు నడిచినా నీకున్నది దిక్కు
నీ జీవన ప్రవర్తనా దిక్సూచి దిక్కు
ఆశకుఅంతం వుండాలి
అంతస్థు తెలుసుకొని ఆలోచించాలి.
పిల్లి పులి పేరు పెట్టుకోగలదు గాని
పులిలా గాండ్రించడం హాస్యాస్పదమౌతుంది.
రాష్ట్రాలు దేశాలుగా మార్చే
దంష్ట్రాల గందరగోళం భూగోళనాశనం,
చొక్కాలు, లాగులు. గాజులు, చీరలు
రకరకాల భాషలు, భాషల్లో ఏసలు
ఎన్నెన్నో కులాలు, కులాలలో వర్గాలు

మనిషి మనిషికీ మతం, మనిషితనం గతం
ఎటు పోతోంది మానవ మేధస్సు చుక్కాని?
ఇటు జీవిలో వ్యక్తిత్వం ఎంతవున్నా రానీ,
ఏకత్వం మార్గంలో పోనీ
ఆత్మ చివరి గమ్యం పరమాత్మ కేంద్రీకృతం
ఆధ్యాత్మిక భాష నారీతి
అన్ని సమస్యలకు పరిష్కార నీతి,
సముద్రం పరివృతమై ఘోషిస్తోంది.
హిమాలయాలు ఎలుగెత్తి పిలుస్తున్నాయి.
సంఘటితకు దూరమైతే సమాధి తప్పదని
దారి మార్చి రోదసి వైపు పయనించినా
మనిషీ, నీకు సుస్వాగతం చెప్పే గోళంలేదు.
ఏ జాతి చరిత్ర చూసినా ఏమున్నది.
గర్వకారణం? నిజమే, కాని
ప్రతీ జాతి ఒకే ప్రజలనుకుంటే
ఔతుందీ గర్వకారణం
కనిపించని గాలి కదిలిస్తుంది.
కనిపించని శబ్దం వినిపిస్తుంది.
కనులు మించే వెలుగు వేగ పయనిస్తుంది.
జాతి ఐక్య ప్రజగా రూపొందిన
గాలి శక్తి, శబ్దశక్తి వెలుగు వేగం పుంజుకుని
ప్రగతి మార్గంలో వర్తిస్తుంది.

(దూరదర్శన్ సౌజన్యంతో)

# కాలం - మనిషి

-కావూరు పాపయ్యశాస్త్రి

మనిషి పరుగు చూసి
మతి పోతున్నది కాలానికి !
వేగం పెంచిన మనిషిని అందుకోలేక
మూగవోయి చూస్తున్నది కాలం !
నిన్న -
కాలం వెనుక పసిపిల్లవాడిలా మనిషి
నేడు-
మనిషి వెనుక 'రోబాట్' లా కాలం
రేపు-
మనిషికి కాలానికి మధ్య
యుగాల అగాధాలు తప్పవేమో
నిముషానికి అరవై సెకన్ల తాబేటి నడకతో
నింపాదిగా సాగుతున్నది కాలం
ఊపిరి తీసుకునే తీరిక లేకుండా
ఉరుకుతున్నాడు కుందేలులా మనిషి !
చదువులకోసం పరుగులు!
పదవులకోసం పరుగులు !
ఆకలితీరక పరుగులు !
అంతస్తులకై పరుగులు
అవనిపైన చాలక
అంతరిక్షంవైపు పరుగులు!
వడి తగ్గి ఒరిగిపోయే వరకు
బ్రతుకు బొంగరపు వేగం తరగదు !
ఒడిలోకి మృత్యువు తనను తీసుకునేవరకు
మనిషికి సుంతైనా విశ్రాంతి దొరకదు !
క్షణంసేపు నిలబడితే
శతాబ్దం జారిపోతున్న భయంతో
వగరుస్తూ పరుగెత్తే మనిషిని
జాలిగా చూస్తున్నదికాలం
తరాల అంతరాలను చూసి
తనలో తానునవ్వుకుంటున్నది కాలం !

# ఫర్లాంగమ్మ

కన్నడ మూలం :
శ్రీమతి 'ఉషాదేవి'

తెనుగుసేత ;
శంకరగంటి రంగాచార్యులు

ఫర్లాంగమ్మ !!!

హ్హా...హ్హా...హ్హా....పలువుర్ముూఢులు పెట్టినపేరిది, ఫర్లాంగమ్మ అని. చాలా ఏళ్ళ క్రిందటిమాట.. అప్పుడు ఎవరికీ కాబట్టని బండరాయిలా పడివుండినాను. ఎవరో ఒక పుణ్యాత్ముడు మలచి, నంబరువేసి, అనేకులకు ఉపకారం చేసే అవకాశం కల్గించినందుకు ఆనందించాను. వందలాదిమంది కష్టాల్లో కలిసి సంతృప్తి నిచ్చేశక్తి కొద్దిరోజుల్లోనే నాకు కలిగింది కదా అనే గర్వమూ నాకు కలిగింది.

నేనున్న చోటనే అనేక బండ్లూ, బస్సులూ చెడిపోతూ వుండేవి ఇందుకు మూలకారణమేమో నాకు తెలీదు. ఏదో దుష్టగ్రహ పీడ అని జనులు నమ్మారు.

'ఆ పాడు బాయి ఉంది కదా. .తోపు దగ్గిర... ఆ బాయిలో మాది పడి చచ్చింద్రా... ఆ రోజ్నుంచీ దయ్యమై ఇట్లా పీడిస్తూవుంది చూడి.'

'రాత్తిరి పూట్ల ఈ దార్లో పయనం చేసేది శానా కష్టంగురూ.. .అందుకే యెకరంజేస్తున్నా. అయినా నీవు బలవంతం చేసి ఈడ్చుకొచ్చినావ్.... ఇట్లాగవుతదని నాకు ముందే తెల్సు.'

'పున్నమి - అమాస దినాల్లో ఈరోడ్లో వొస్తే గ్యారంటీ. ..ఏమన్నా అయితుంది. తెల్లచీర కట్టుకొన్ని ఆసది వస్తావుండేది ఎట్లా కనిపిస్తుందనుకొన్నావ్.... నేను ఆదినం ప్రత్యక్షంగా చూచి, భయపడి, పరుగెత్తి పోయినాను '

ప్రయాణికులు తమ తమ అనుభవాల్ని జ్ఞప్తికి తెచ్చుకుని, వివరంగా వర్ణిస్తూ వుండేవాళ్ళు.

శుక్రవారపు సంతకుగాను బండ్లుకట్టుకొని బయల్దేరిపోతూన్న రైతుల మాటలివి.

రాత్రిపూట ఈ దారిలో వస్తూన్న బస్సుల్లోనూ ఇదే గందరగోళం.. కోలాహలం...పద్నెనిమిదో మైలు, ఏడో ఫర్లాంగు ఈరాయి దగ్గరైనట్లంతా జనులజంఘాబలమే ఉడిగి పోయినట్లవుతూండేది; అరచేతిలో ప్రాణాలు పట్టుకుని ప్రయాణికులు ఇష్టదేవతల జపాలు చేస్తూండేవాళ్లు.

వాళ్ళ ఆలోచనలకు తగినట్లు బస్సు చెడిపోయి ససేమి కదలనని సమ్మెకట్టేది. డ్రైవరూ, కండక్టరూ కాలగమనమే తెలియక బానెట్ తెరిచి రిపేరికి పూనుకునేవాళ్ళు.

భయకంపితులయిన ప్రయాణికులు కాలక్షేపానికై గుసగుసలు మొదలుపెట్టేవాళ్ళు. ఉప్పొంగి వొస్తున్న నవ్వును చాలాకష్టంతో అణచుకుని నేను మాటల్ని వినేదాన్ని.

'చూడు చూడు. .దూరంలో...ఆచెట్టుదగ్గిర ఏమో వస్తూవుంది.'

కల్పనాప్రపంచపు దురాకృతిని ఒకప్రయాణికుడు చూపుతున్నాడు. అతని ఊహకు అందరూ తలపంకిస్తూన్నారు.

'ఔను, అదే ఇట్లా పీడిస్తూ వుండేది. పూర్వీకులు చెప్తూఉన్నది కొంచెంకూడా అసత్యంకాదు.'

మరొకడు ఉత్తరం చెప్తున్నాడు, అనుమానం స్థిర పడుతూన్నది.

'మూడు రోజులకొసారి బస్ చెడిపోతూందంటే ఏంటి విచిత్రం? పూర్వం ఈ బస్లోనే నేను హాసనానికి పోయినాను...అపుడూ ఇట్లే అయ్యె

'ఈ అడవిలో ఇట్లైందే .ఏంటయ్యా చెయ్యడం. ? శివుడే కాపాడాలి !'

—ఒక రైతు భక్తితో భగవంతునికి జవాబ్దారీ ఒప్పిస్తూన్నాడు

'అదో...ఆ పక్కే వస్తూన్నట్లుంది !'

ప్రయాణికుల భయాన్ని చూసి పూజారి పకపక నవ్వుతున్నాడు.

'అయ్యో, పిచ్చిమనఘుల్లారా.. ఎందుకురా ఊరికే భయపడతారు ?నేనిక్కడగాయత్రీజపంచేస్తూన్నపుడు ఏదయ్యం, పీడ, పిశాచం ఈదిక్కుగా వస్తూందండిరా?'

'మీరిక్కడ లేకుంటే మాగతేమయ్యేదయ్యా స్వామీ ?.. ఆ హనుమంత్రాయడే మిమ్మల్ని పంపించి ఉండాలె !'

కృతజ్ఞత తెలుపుతూ ఒకరైతు కైమోడ్పు ఘటి స్తున్నాడు.

ఊరిముందుగల హనుమంతరాయని గుడిపూజారి తారాస్థాయిలో మంత్రం ఘోషించమొదలు పెట్టినపుడు ప్రయాణికుల్లో ధైర్యం పొడసూపింది.

అతని ధ్వని పెద్దదైనట్లంతా జనుల నమ్మకమూ ఎక్కువవుతూందేది. ప్రయాణికులు నెమ్మదిగాఏమైనా నిదానంగా ఊపిరి పీల్చుకోవడం ప్రారంభించేవాళ్ళు

భ్రాంతులైన వాళ్ళభయాన్ని చూసి నేను నవ్వు కుంటూ వుండేదాన్ని.

అంతసేపటికి డ్రైవరూ, కండక్టరూ నానా అవ స్థలూ పడి బస్సును సరిచేసి 'ఈ ఫర్లాంగమ్మ పీడ' అని తిడుతూ, ముందుకు పోయేవాళ్ళు.

ఈ అవాహుతాలు జరిగినట్లంతా 'అనిష్టసూచకము' అని నన్ను నిందిస్తూ వుండేవాళ్ళు—జనులు. నా దృష్టిపడిన ఏ వాహనమైనా అబాధితంగా ముందుకు పోజాలదను వార్త ఇరుగు పొరుగూర్లలో కూడా ప్రసారమయ్యింది నా క్రూరదృష్టి నుండి తప్పించు కోవడం కోసం జనులు మొక్కుబళ్ళు చెల్లిస్తూ నాకు శరణు చొచ్చేవాళ్ళు.

అదొక వానకాలపు దినం....నా కింకనూ బాగా జ్ఞాపకముంది....వాన అనేది ఎప్పుడూ అలాగా కురవ లేదనే చెప్పాలి రస్తామీదంతా మోకాటిలోతు నీళ్ళు పడగెత్తుతున్నాయి. ఉరుముల్నీ, మెరుపుల్నీ, పిడు గుల్ని దిగ్భ్రాంతురాలై చూస్తూన్న నా కూడా భయం కలిగింది నిసర్గరమణీయమైన ఆ రుద్ర సౌందర్యాన్ని రెప్పవేయక చూస్తూ నేను కూర్చు న్నాను.

నరమానవుడు కదలడాని కూడా భయం చెందు తున్న ఆవేళలో, ఒక ఎడ్లబండి నావేపే వస్తూన్నట్లు తోచింది నదానంగా

అవును. నా ఆలోచన కనుసారంగా ఆ బండి కొంతదూరంలో ఆగింది. లోపల్నించి ఒక అబల ఆర్తాలాపం వినవచ్చింది

బాధను తట్టుకోలేక రోదన :. మొగడి అవివే కాన్ని నిందిస్తూ ఆమె గేలిచేస్తూ వుంది

ద్వేషం సాధించడానికూడా వేళాపాళా లేదేమండీ?

.. అపాయం గిపాయమయితే ఏంగతి? ..

అయ్యో ... అమ్మా ... నొప్పి ... తట్టుకోలేను ...

బండి నిలిచింది. క్రిందికి దిగిన ఆ అతివ నిండు చూలాలన్నది నాకు తెలియవచ్చింది. వివేకం లేని ఆ మగవాణ్ణి నిందించాను. ఆ సమయంలో నాతో ఏ విధమైన సాయమూ జరుగదుకదా, నే నుండి

కూడా ఏం ప్రయోజనం ? అంటూ చేతులు నలుము కుంటూ వ్యథచెందాను.

కారుమబ్బులు నిదానంగా చెదరుతున్నాయి. ఆ స్త్రీ జీవితంలో నూ నవోదమైంది. తల్లీ తన శిశువుతో బయల్దేరి నిలిచింది.

శిశువు చిఋనవ్వుల మోమును చూచినంతనే, అంతకు మునుపు తాననుభవించిన కష్టాలను అన్నింటినీ ఆ తల్లీ మరచిపోయింది. వెచ్చని గుడ్డతో శిశువును భద్రపరచి బయల్దేరి నిలిచినవుడు ఆ తల్లి మాట్లాడిన మాటలింకా నాచెవుల్లో మార్మ్రోగుతున్నాయి

'ఈ రాయి ... ఊహు ... ఇది రాయికాదు, ఏదో సత్యవంతమయిన దైవం అయివుంటుందండీ ... ఉద్భవమూర్తి ఆయి ఉండాలి చూడండి .. నేనెంతభయపడినాననుకున్నారు? కష్టమంతా మంచులా ఎలాక్షణార్థంలో పరిహారమయింది? ఈ దేవి దయ వలన ప్రస్తుతం సుఖంగా ప్రసవమై పసికందు బ్రతికింది!

అని కృతజ్ఞతగా శిశువుతోపాటు నాకు నమస్కరించింది.

ఆమె భక్తిపరవశతను చూచి ఆమె భర్త ఉగ్రుడయ్యాడు.

'దేవతంట దేవత... ఇదొక ఫర్లాంగ్‌రాయి'

అయ్యో ... అంత పాపం అనకండి. ఈ దేవత పేరే ఫర్లాంగమ్మ అని ఇక్కడికి వచ్చి చేరడం మన పుణ్యం !,

అని ఆతల్లి మొగడి నోరు మూయించింది. ఆతల్లి ఆశీర్వాదఫలమే కాబోలు, నాకు పిశాచత్వంపట్టంపోయి దేవత్వ పట్టం వచ్చింది.

నేనున్న చోటు బహురమ్యంగా ఉండేది. చుట్టూవున్న చెట్టుచేమల్తో, కొండకోనల్తో, ఫలపుష్ప భరితాలైన వనాలతో ఆస్థలం రమణీయమై, కనులపండువుగా వుండేది ఆచోటికి అత్యంతం పాతదానినైన నాకు కూడా ఆచ్చటి సౌందర్యం అప్పుడప్పుడు పిచ్చెక్కిస్తూండేది

అదొక మధ్యాహ్నం .. కాలిగుడ్డలు ధరించిన ఒక వ్యక్తి నాకు కొంతదూరంలో వున్న అశ్వత్థపు కట్టమీద కూర్చుండి ఉన్నాడు. కతూహలంతో నేను అతనినే తదేకంగా చూడ మొదలు పెట్టాను. సాయంకాలం గడచిపోయినప్పటికీ అతని జపం ముగిసినట్లు కనిపించలేదు. అశ్వత్థపు కట్టమీద విడిది చేసి సదా ధ్యానాసక్తుడై కూర్చుండివున్న అతడి ధ్యానానికి భంగం కలిగించే ప్రయత్నాన్ని నేను చేయలేదు.

అతని మహిమను తెలుసుకోవాలన్న నాకుతూహలాన్ని కష్టపడి తొలగింప యత్నిస్తూ వుండిన నేను, మనసులోనే ఎంత దగ్గిర ఐనా ఎంతదూరం అని ఆలోచించి ఊరకవుతూ వుండినాను,

బాటసారులిస్తూవుండిన అల్పాహారంతోనే అతని జీవనపథం సాగిపోతూ వుండేది. ఫర్లాంగమ్మ కీర్తిని వినే ఇచ్చటికి అతడు వచ్చివుండవచ్చునని నాకనిపించింది.

దినదినమూ భక్తుల గుంపు మితిమీరిపోతోంది.

నన్ను పూజించిన తరువాత యోగి అని భ్రమించి జనం అతనికి కానుకలప్పగించే వాళ్ళు. ఫర్లాంగమ్మ పూజారియై పండ్లు, కాయలూ, డబ్బు, సొమ్ము గుడ్డలు గడించాలని కపటవ్రతం పూనిన ఆయోగి, స్వార్థం సాధించుకునేందుకు నన్నే బలిచేశాడు.

ఆ చోటనే ఒక గుడి కట్టించాలని నిధిని ప్రోగుచేశాడు సొమ్ముల్లూ వస్త్రాలూ ఇత్యాదులతో నన్ను అలంకరించాడు. బందీలా దేవళంలో ఉంచి, దేవత అంటూ ఆరాధించాడు ... పిచ్చిప్రజలు అతడి మాటలకు మరులుగొన్నారు.

భక్తాదుల మొరలను వినివిని నేను చెవిటి దాన్నైనాను వాళ్ళ కష్టలు చూసి కన్నీళ్ళు కారుస్తూ వుండినాను. పేదవాళ్ళు అప్పచేసి అయినా నాకు పూజా పునస్కారాలు చేయించి నా కటాక్షం పొందయత్నించే వాళ్ళు. వీళ్ళ కష్టనష్టాలకు పరిహారం కలుగచేసే చైతన్యం నాకెక్కడనుంచీ వస్తుంది? అని నేను పరితపించే దాన్ని.

అత్యంతాశ్చర్యకరమైన సంగతేమిటంటే... కావి గుడ్డల సన్యాసి నేడు సంసారి అయినాడు! చేతినిండా డబ్బుచేసుకుని, సుఖ సంతోషాల్లో ఓలలాడుతున్నాడు. ఈ ఒక్క వ్యక్తికైనా నావలన ఉపకారం జరిగింది కదా అన్నదే నా పాలిటికి మిగిలిన ఒకే ఒక సంతృప్తి.

ఇదంతా విధి వైచిత్రం అనాలేమో తెలియడంలేదు ఇంతకూ రాయిగా ఊరివెలుపల పడివుండిన నేను నేడు దైవత్వపు పట్టమున కెక్కినాను ! సంవత్సరానికొకసారి జనం కలిసి పెద్దతిరునాళ చేస్తారు. పర్లాంగమ్మ జాతర అని మీరు పంచాంగంలో కూడా చూచి వుండవచ్చు!

హ్హా. . హ్హా . . హ్హా ... ఈ జనం తెలివి లేనితనాన్ని గురించి ఎవరికి చెప్పాలో అంటూ ఇదివరకూ వేచి చూచాను. ఇప్పుడు చెప్పాను ... రేపు పరసు ... మీరందరూదయచేసి రావద్దండి ... రారుకదూ?- ...



# చింతావారి కవితా వైభవం

— శివలెంక ప్రసాదరావు

'కథక చక్రవర్తి'గా, 'బాలవాఙ్మయబ్రహ్మ'గా భావకవితాయుగంలో ప్రసిద్ధిగన్నవారు దీక్షితులుగారు. చింతాభీమశంకరంగారితో కలసి 'చింతాశంకరదీక్షితులు' అనే పేరన మొదట్లో జంటకవిత్వం రచించారు వీరు 1912నాటికే వీరు రచించడం ప్రారంభించారు.

వ్యావహారిక భాషను అనుసరించడంలో గిడుగు వారూ, గేయరచనా విధానంలో గురజాడవారూ, ఆధ్యాత్మికపథనిర్దేశంలో రమణ మహర్షులూ దీక్షితులు గారికి ఆదర్శం.

ఏకాదశి, హాస్యకథలూ. పటీరావుకథలు అనేవాటిని రచించి 'కథక చక్రవర్తి'గా పేరుగాంచారు. 'శబరి' అనే నాటకాన్ని వెలువరించారు. 'తుది మొక్కు' (1916), 'లక్కపిడతలు', 'దాసరిపాట', 'గోపీమోహిని' ఇత్యాది కవిత్వ రచనలు. 'బాలవాఙ్మయ బ్రహ్మ'గా కొనియాడజేశాయి.

వీరి కవిత్వాన్ని ముఖ్యంగా (1) ప్రణయం. (2) ప్రకృతి. (3) ఆధ్యాత్మికం (4) సంఘసంస్కరణ. (5) దేశభక్తి (6) బాలగేయాలు చేసి పరిశీలించవచ్చు.

## ప్రణయం

దేశానపుట్టిన ప్రతిమనిషికీ జీవయాత్రకు ప్రేమను కూర్చేది 'ప్రేమ' ఒక్కటే అని చింతావారి గాఢ విశ్వాసం భార్యాభర్తల అనుబంధం అపురూపమయిన దని ఆయన నమ్మకం. అంతేకాదు. భర్తయే కాంతకు 'స్వర్గ'మనీ భర్తలేని స్త్రీజీవితం 'నరకం' అనీ వీరి అభిప్రాయం,

అందుకే 'తుదిమొక్కు' అనే కావ్యంలో

'భర్తలేకున్న నాతికి ఫలములేదు
భర్తలేకున్న బోటికి కీర్తి సున్న
మగడు లేనట్టి కాంతకు మనుగడేల
నాథుడే కల్పవృక్షంబు నాతికిలను'[1] అంటూకథా నాయిక ముఖంగా చెప్పించారు వీరు.

## ప్రకృతి

అలతి అలతి పదాలతో ప్రకృతి సౌందర్యాన్ని చిత్రీకరించడంలో చింతావారు అందెవేసినచేయి. ఉదాహరణకు—'ఉదయలక్ష్మి' అనేకవితలో పసుపుతో మింటిని అలికి, కుంకుమతో ముగ్గులువేసి. పూలు రేకులు విప్పి పుప్పొళ్లతో ఉదయలక్ష్మిని కొలవడానికి సూర్యుడు సిద్ధమయాడనీ, వాయువు చన్నీట జలక మాడి పుప్పొడి దేహంనిండా పూసుకుని వచ్చాడనీ అంటాడు కవి.

అదే సందర్భంలో—

'ముత్యాలసేనలు ముదముతో జల్ల
పత్రాగ్రముల మీద పదిలంబు చేసె
మంచిమంచిరకాల మంచుబిందువులు

1. తుదిమొక్కు—చింతాశంకర దీక్షితులు—శ్రీకృష్ణా ప్రింటింగ్‌వర్క్సు-రాజమండ్రి+1915-పు. 16.

ధరణిపై బరపె రత్నంబు కంబళులు
తోరణాలే చివురుల తోడుతకట్టె
మింటిపై నొక్కచో మేఘకన్యకలు
చేరిరి హారతి చేతబట్టుకొని'[1]

ఇత్యాదిగా ప్రకృతి ఉదయలక్ష్మిని కొలవడానికి తయారయినట్లు చెప్పాడు

అలాగే 'చంద్రార్పణము' అనే కవితలో చంద్రుణ్ణి ఆహ్వానిస్తూ

'రజని సామ్రాజ్యమేలంగ రాజువచ్చె
స్వచ్ఛతను విలాసంబులు ప్రబలెదిశల.[2]

ఇత్యాదిగా అంటాడు కవి.

ఆదేవిధంగా 'గోదావరిమాత' అనే కవితలో
'ప్రణయ వర్షంబాయె వర్షించునమ్మ
మనకిల వేల్పాయె మన పట్టుగొమ్మ
మనకల్పభూజంబు మనవేల్పుటావు
మముగాంచి మము బెంచి మన్నించుమాత'[3]

ఇత్యాదిగా కొనియాడతాడు.

ప్రకృతిని పరిశీలించడంతోబాటు దీక్షితులుగారు అందులోని ప్రణయాన్ని పసిగట్టారు. దానికి 'హరిణ దంపతులు' అనే కవిత ముఖ్యోదాహరణం. అడవిలో కలిసిన రెండు హరిణాలు దంపతులై పరస్పరం 'ఒడలు నొడలి రాచు' కొంటూ, 'మెడను మెడపై నుంచి మెల్లగ ప్రణయవాక్కులు' పల్కుతూ, 'ముట్టె ముట్టెనుజేర్చి యెన్నో ముద్దులు' గొంటూ లోకంలోని కష్టాలను మరచి ప్రణయసాగరంలో తేలియాడుతూ ప్రమదాన్ని పొందాయి. బ్రతికినంతకాలమూ 'ప్రణయ మంత్రం' మఱవమంటూ ప్రకృతిసాక్షిగా అవి బాస చేసుకున్నాయి. ఈ కథద్వారా మనిషికయినా మృగానికయినా ప్రేమఒక్కటే జీవయాత్రలో మాధుర్యాన్ని నింపుతుంది అనే ఉపదేశాన్ని ఇస్తాడు కవి.

**ఆధ్యాత్మికం**

చింతావారికి శ్రీకృష్ణుడంటే ఎక్కువ భక్తి అనిపిస్తుంది. ఉదాహరణకు 'వేణునాదము' అనే కవితలో-

'తొలుదొల్త దుఃఖాలు దూరమ్ముచేసి
నిండు మానసమును నిర్మలపరచి
ఆనందబీజాల నంతటనాటి
అంతయు దనలోన ఐక్యమొందంగ
జేయుచు వ్యాపించు చిన్మయు వేణు
నాదంబొసంగును నాకు సంపదలు'[4]

అనడంలో శ్రీకృష్ణవేణుగానలోలత్వం వ్యక్తం.

అందుకే హేతువాదంతో దేవుడు లేడనే నాస్తికులతో దీక్షితులుగారు ఏకీభవించరు.

ఆ సందర్భంలో
'వెలిగేదీపం ఆర్పెయ్యకురా
దేవుడు లేడని తిట్టబోకురా
తల్లో మెదడూ చేతికి కండా
నిండావుంటే మీసాల్ దువ్వడ
మెందుకురా ? మరి దేవుడు లేడని
బీరాలెందుకు నవ్యకవీ ![5]

1. ఉదయలక్ష్మి-మహోదయం-పు. 6.
2. చంద్రార్పణము- " -పు 8
3. గోదావరి మాత- " -పు. 7-8.
4. వేణునాదము—మహో—పు. 10.
5. దేవుడ లేడా నవ్యకవీ — ప్రతిభ—ఫిబ్ర—1937—పు 354

అంటూ వీరు ప్రశ్నించడం పేర్కొన దగింది.

సంఘసంస్కరణ

నాటి బాల్యవివాహాలకు చింతావారు వ్యతిరేకులు. ఆదే వీరు 'తుదిమొక్క' కావ్యంలో నిరూపించారు.

ఇందులో ఒకబాలకు వృద్ధుడితో వివాహం అవుతుంది. చెలికత్తెలు 'ముసలయ్య పెండ్ల'మంటూఆమెను వెక్కిరించారు ముక్కుపచ్చలారని ఆమె భర్త హఠాత్తుగా మరణించాడు.

ఆ సందర్భంలో—

'పట్టుమని యొక్క కొడుకైన పుట్టలేదు
తీరుముచ్చట లొకటైనఁ దీరలేదు
పరగ బొమ్మల నోమైన బట్టలేదు
అమ్మయడుగంటె మంతలోనే !![1]

అనడంలో ఆమె దౌర్భాగ్యాన్ని వ్యక్తం చేశాడు కవి. చివరకు ఆమె ఆత్మహత్య చేసుకున్నదనే విషయాన్ని

'శిల జూచి వందనం బాచరించి
"దేవుడా" యని మింటిపై తేటిమాచె
చలనమొక యింతలేని యా జనములోన
కలవరము గల్గె శబ్దంబు గానవచ్చె"[2]

ఇత్యాదిగా ధ్వనించాడు కవి. నిశ్చలమైన నీరు చలించి శబ్దించడంలో అది వ్యక్తం.

అలాగె 'వ్యర్థ ప్రయత్నములు'[3] అనే కవితలో 'సాంఘిక సేవ చేస్తే పుణ్యముం' టుందనే ఉపదేశాన్ని చెప్పించాడు. ఆ సందర్భంలో తులసి మొక్కను పూజ చేయడం, విగ్రహారాధన సల్పడం, 'క్రొత్త క్రొత్త రకాల విద్యలు, ఆటలు, పాటలు' పిల్లలకు నేర్పించడం, పూలను దండగా కూర్చి మెడలో వేసుకోవడం ఇత్యాదులు వ్యర్థ ప్రయత్నాలుగా పేర్కొనబడ్డాయి.

దేశభక్తి

చింతా వారికి పరదాస్య శృంఖలాలు సరిపడవు. ఆయన ఒక స్వేచ్ఛాజీవి. అందుకే 'తృప్తి' అనే కవితలో

'సేవకావృత్తి పరులకు జేయకుండ
పుట్టి బ్రతికినవాడెపో పుణ్యతముడు
వాని మంతన మతని కవచము వాని
నేర్పు సత్యము పన్కుట నియతి గల్గి'[4]

అంటూ వ్యక్తం చేస్తాడు కవి.

అలాగే తనకు స్వాతంత్ర్యము లేదని 'చుక్కలు తిరిగే హిమాద్రిపై ఆవాసము చేసే గౌరిశుడి'కి మనవి' చేసుకునే సందర్భంలో—

కళ్ళు తెరవగా కానవచ్చినవి
కాలు చేతులకు సంకెళ్ళు
మాట లాడుటకు పెదవి విప్పగా
తాళము పడ్డది నా నోరు
నీ పాదాలకు నిత్యసేవనే
నెట్లు సేతునో సెలవిమ్మా
నీ నామాంకిత దివ్య గీతములు
ఎట్లు పాడుదును సెలవిమ్మా![5]

ఇత్యాదిగా అంటాడు కవి.

బాలగేయాలు

లక్కపిడతలు అనే సంకలనంలో ఉన్నవి ముఖ్యంగా బాలగేయాలే? వీటిలో పసిపాపల జిలిబిలి

1. తుదిమొక్క — పు. 12.
2. తుదిమొక్క - పు 16
3. వైతాళికులు- పు. 184.
4. ఆంధ్రపత్రిక — ఉగాదిసంచిక — 1916 — పు 97.
5. మనవి — వైతా — పు. 239-40

పలుకులూ, ఆలోచనా రీతులూ వ్యక్తమవుతాయి. ఉదాహరణకు 'కమలాలు' అనే గేయంలో ఒకబిడ్డ

తెల్లచీర కట్టుకొని
మెల్లగాను నవ్వుతున్న
నీటిమీద పండుకొన్న
చిట్టి చిట్టి కమలాలు[4]

తనకు తెచ్చిపెట్టమని వేడుకోవడంతో ఒక చక్కని పదచిత్రం కానవస్తుంది.

ఇలాగే 'పాప' అనే గేయంలో
చుక్కను నేనే పాప కంటిలో
తళుకు తళుకుమని మెరయుచుందును
తెల్లని చల్లని చంద్రుడ నేనే
పాపాయి ముఖమై పాట పాడుదును
ఎర్రటి మెత్తటి తామర నేనే
పాప అడుగులై ఆట లాడెదను
ఘుమఘుమలాడే పనసపండును
నేను పాపనై ఒళ్లోచేరి
అమ్మ ముద్దులకు ఘుమఘుమ నిస్తా
అమ్మ పాటలను కమ్మగ చేస్తా,[1]

అనడంలో పాప పనసపండనీ, ఆమె కళ్ళు మెరిసే చుక్కలనీ, ముఖం చంద్రుడనీ, అడుగులు తామర లనీ ధ్వనిస్తుంది.

ఆదేవిధంగా 'ముద్దులు'[2] అనే గేయంలో పాపాయి ముద్దులు పంచిపెడుతున్నాడనీ ఆ ముద్దుల పండుగ' లో బాలకృష్ణుడు గోపికలకు ముద్దులు పంచుతున్నా డనీ అభివర్ణించాడు కవి.

పసి బాలల ముద్దులకు మంచి ప్రభావం ఉంది. కాబట్టే 'వరహాల తల్లి'కి[3] ముద్దియ్యమని అడిగి నప్పుడు 'లక్క పిడతలతోటి గుజ్జన్నగూళ్ళు వండి తాటాకు బొమ్మకు పెళ్ళిళ్ళు చేసి ఆడుకొని వచ్చాక మిద్దిస్తా' నని అంటుంది ఆ పిల్ల అంతవరకూ ఆగ వలసిందే మరి!

అలాగే'నవ్వు'ను వ్యాఖ్యానిస్తూ'పక్కనసూర్యుడు నవ్వి' తే 'పట్టపగలూ' చంద్రుడు నవ్వితే 'చల్లని వెన్నెల' పాపాయి నవ్వితే'పరమానందం'[1] ఫలితాలని అంటాడు, కవి.

అదేవిధంగా 'తువ్వాయి' అనే గేయంలో తువ్వాయి మెళ్లొ 'మువ్వలూ' నోట్లో 'తెలిపాల నురుగులూ' కాళ్లల్లో 'పరుగులూ' ఉన్నాయంటూ చెప్పి దాని స్వరూ పాన్ని మన ఎదుట సాక్షాత్కరింప జేశాడు కవి.

'తాండవకృష్ణుడు' నాట్యమాడే సమయంలో నవ్వు వెన్నెలల కలకలలూ, మకర కుండలాల తళ తళలూ, ముక్తాహారాల గలగలలూ, చిరుమువ్వ గంటల గణగణలూ, కాళ్ల గజ్జియల ఘల్లుఘల్లు శబ్దాలూ రూపులు దిద్దుకున్నాయనీ నెమలి పురివిప్పుకు నాట్యం చేస్తున్నప్పుడు 'తాండవకృష్ణుడు' స్ఫురిస్తా డనీ అంటాడు కవి.

అదే సందర్భంలో—

'మేఘాలందం నీలాలందం
కాంతల కాటుక కన్నుల అందం

8. నాల్గవముద్రణ—స్వతంత్రపున్—మద్రాసు-2. 4. ఆదే పు. 8

1. ల. పి—పు. 58. 2. ఆదే-పు. 59. 3. అదే. పు 15

అందాలన్నీ జీవం దాలిచి
నీలో నాట్యం చేసేనే![3]

అంటూ 'నెమలిని' పొగుడుతాడు కవి.

ఈ విధంగా జానపదవాఙ్మయంలోని మాధుర్యాన్నీ, తెలుగు నుడికారంలోని అంద చందాలను అందించి పాతపదాల రక్తిమనూ సొగాన్నీ చవి చూపించారు దీక్షితులుగారు. ఎంత క్లిష్టమయిన భావాన్నయినా అలవోకగా హృదయానికి హత్తుకునేటట్లు చెప్పడంలో వీరు సిద్ధహస్తులు. అందుకే సులభమైన శైలిలో జాతీయ భాషలో హాయిగా గేయపఙ్తిలోని ఒఱుపును ప్రదర్శిస్తూ పాడుకునే విధంగా, వస్తువుకు తగిన వాతావరణ పరికల్పనం చేసి రచించడంలో చింతావారు తమ ప్రతిభను చాటుకున్నారు. భావకవితాయుగంలో బాలగేయ రచయితగా ఒక స్థానాన్ని ఏర్పరచుకున్నారు.

చింతావారు లేకపోయినా ఆయన కవిత మాత్రం ఆ చంద్ర తారార్కం నిలుస్తుంది.

1. నవ్వు—ల. పి. పు 20. 2. ల. పి-పు 60. 3. నెమలికన్ను—అదే-పు 26

# రాయప్రోలు వారి దేశభక్తి

— వి. ముకుందాచార్యులు

ఈ ఇరవయ్యో శతాబ్ది మొదటి భాగములో ఆంధ్ర కవితారంగానికి మార్గదర్శకులు, యుగకర్తలు రాయప్రోలు, గురజాడ నిస్తేజమైన సాహిత్యానికి క్రొత్త తేజస్సును కల్పించిన వారు వీరే వ్యవహారిక భాషకు మాత్రాఛందస్సులతో గురజాడ వారు మార్గాన్ని ఏర్పరిస్తే సరళగ్రాంధిక భాషలో పద్యఛందస్సులోనేయతి, ప్రాస నియమాలను సడలించి క్రొత్తమార్గాన్ని యేర్పరచారు రాయప్రోలువారు గురజాడవారి మార్గమును పొగడని వారు అరుదు. చింతా దీక్షితులు అన్నట్లు ఆయన మార్గమును అనుసరించిన వారు కూడా అరుదే. రాయప్రోలు వారి ఒరవడిలో ఆనాటి నుండి ఈ నాటి వరకు ఎందరో, విశ్వనాథ, నాయని సుబ్బారావు, కృష్ణశాస్త్రి జాషువా వంటివారు నడుస్తున్నారు. భావ కవితా యుద్యమానికి ఆయనే ఆద్యుడు

భావదారిద్ర్యముతో, భాషాదారిద్ర్యముతో అణగారి, బానిసత్వములో క్రమ్గుచున్న భారత జాతికి ముఖ్యంగా ఆంధ్రజాతికి తొలివైతాళికులు గురజాడ, సుబ్బారావులు. గురజాడవారి దేశభక్తిని దీటుగా, సాటిగా నిలువగలిగినది రాయప్రోలు వారి "జన్మభూమి." అందుకే కవితా సంపుటాల్లో ప్రథమ, ద్వితీయ స్థానాలు వాటివే !

ప్రపంచమంతా తన దేశముగా గుర్తించిన వారు గురజాడ. తన దేశములోనే ప్రపంచాన్ని గుర్తిస్తారు రాయప్రోలు.

భారత జాతి కొన్ని శతాబ్దముల విదేశీ పాలనలో, బానిసత్వముతో నిర్వీర్యమైనది. సంకుచించిన జాతీయ దృష్టి ఒకరిదైతే, నేల విడిచి సాముచేసే విదేశీ వ్యామోహం యింకొకరిది. అది అంధయుగం. జాతి గాఢ తిమిరములో జడత్వంతో పడివుంది. దానిని నిద్రలేపాలి. యుద్ధభేరి మ్రోగించి జడత్వాన్ని పారద్రోలాలి ఆదే ఆనాటి కవుల ధ్యేయం. కర్తవ్యం. గురజాడ మొదలుపెట్టిన ఈ బృహత్కార్యాన్ని భుజాన వేసికొని ముందుతరాల వారికి అందించిన ఘనుడు శ్రీ రాయప్రోలు.

ఒక లక్ష్యసాధనలో మనిషికి కావలసినది తన లక్ష్యం మీద అచంచల విశ్వాసం. స్వతంత్ర భారతం. ఆంధ్రదేశానికి, ఆంధ్రజాతికి గతవైభవ సముపార్జన ఆయన లక్ష్యాలు. "మాతృస్తవమ్"లో యీయనకు తన లక్ష్యముపైగల విశ్వాసము అద్దము పట్టినట్లు కనబడుతుంది.

"ధ్రువం భారతీయ స్వారాజ్యం స్వతంత్రం."

భారతదేశమునకు స్వతంత్రము, స్వారాజ్యము వచ్చుట ఖాయమని దీనిభావము. బానిసత్వంలో వున్న భరతజాతికి ధైర్యాన్ని ప్రసాదిస్తూ నిద్రాణమైన వీరత్వాన్ని మేల్కొలిపి కర్తవ్యోన్ముఖులుగా దేశభక్తి పరాయణులుగా కావించేదిగా వుంది పై వాక్యం.

ఆయనకు తన దేశమాతపై అవ్యాజమైన భక్తి. తన కవిత్వాన్ని ఆ అమ్మకే సమర్పిస్తున్నానుఅంటారు రాయప్రోలు వారు.

"అస్మన్నవ్య వాచాసరః<br>ప్రాతః పద్మమరంద భాండమిదె<br>అంబా ! స్వీకరింపగదే !"

ప్రభాత వేళలో సాహితీ సరస్సులో వికసించిన పద్మ మకరందంతో నిండిన కావ్య భాండాన్ని సమర్పిస్తున్నాను అని దీని భావము. తేనెపలుకుల కావ్య భాండాన్ని భరత మాతకు సమర్పిస్తున్నానని రాయప్రోలు వారు తన కవితా సరళి, శైలి, భావలక్షణాలను పైపద్యపాదాలలో తెలిపారు.

అయన ఆనాటి ఆంధ్రరాష్ట్రమును, ఆంధ్ర ప్రజలను బహుధాన్య (1938) ఉగాది కవితలో

"ఓఢ్రులం గలసి పోనొల్లక యల్లాడు
బ్రహ్మపురోపాంత బంధుజనము,
ద్రవిడదేశాంతర గ్రస్తమైన సూత్ర భా
పాక్షామమున క్రుంగు స్వకుల జనము,
కర్ణాటద్వేషకబళిత కంఠమై
అగచాట్ల నడగారు ఆ ప్రజనము,
బలవద విశ్వాస బద్ధమైపెక బోవు
రాయలసీమానుర క్తజనము,
అతి చిరంత నావిచ్ఛిన్న మయిన ఆంధ్ర
జాతి ఘాత చరిత్రను స్మరించి
తదృవిష్మదభ్యుదయ సంధానమెంచి
కలుపవమ్మ ! ఏకముగా, ఉగాది తల్లి !

ఆనాటి మద్రాసు ప్రావిన్సు నేటి ఒరిస్సాలోని కోరాపుట్, గంజాం జిల్లాలో కొంత ప్రాంతంవరకు ఉండేది. బరంపురం (బ్రహ్మపురం) ప్రాంతంలో ఆంధ్రులు ఎక్కువగా వుండేవారు.

శ్రీతాపి ధర్మారావు, గిడుగు సీతాపతి, గిడుగు రామూర్తి పర్యులు ఆ ప్రాంతం వారే! పర్లాకిమిడి తాలూకా ఒరిస్సాలో కలవాలని పర్లాకిమిడి రాజుగారి కోరిక, కాని ప్రజలు అందుకు ఒప్పుకొనలేదు. శ్రీగిడుగు సీతాపతి నాయకత్వమున రాజుగారికి వ్యతిరేకముగా వుద్యమాన్ని లేవదీసారు 1938 లో గిడుగు సీతాపతి లండన్ పార్లమెంటరీ కమిటీలో వాదించి ఒప్పించినా రాజుగారి ఒత్తిడి వలన ఆ భాగాలు 1936లో ఒరిస్సాలో కలిసి పోయాయి.

తంజావూరు, మధుర నాయక రాజుల కాలాలలోను, తరువాతి మహారాష్ట్ర రాజులైన పేష్వాలకాలంలోను ద్రవిడ దేశంలో తెలుగు ఒక వెలుగు వెలిగింది. కానిరానురాను ద్రవిడ దేశంలో తెలుగు భాషకు ఆదరణ తగ్గి, భాషాక్షామం ఏర్పడింది కర్ణాటక రాష్ట్రములోని బళ్లారి, కోలారు ప్రాంతాలు ఆంధ్రరాష్ట్రములో చేరవలసి యుండగా వాటిని పోగొట్టుకున్నాం అప్పటి వుద్యమాలు నిష్ప్రయోజనాలైయ్యాయి.

ఒకనాటి రత్నాలసీమ, నేటి రాళ్ళసీమగా మారిన రాయలసీమ ఈ ప్రాంత ప్రజలు ఆంధ్ర రాష్ట్రములో చేరితే తమకు అన్యాయం జరుగుతుందని భావించినట్లు తోస్తుంది. రాష్ట్రము నలుమూలలలోని సంఘర్షణలను వివరించి వీరందరిని యేక త్రాటి మీద నడిపించమని ఉగాది తల్లిని ప్రార్థించారు శ్రీ రాయప్రోలు.

ఇక ఆనాటి సంఘం ఎలా వుందో ఆయన 'ఆంధ్ర' అనే ఖండ కావ్యంలో వివరించారు.

పెను జడల్ విరబోసి కొని తాండవం బాడు
ఈర్ష్యా పిశాచి నట్టింటిలోన,
సవతి బిడ్డ విధాన నవయు తల్లి తెనుంగు
విశ్వవిద్యాలయ వీధులందు.
దోషశల్యమ్ములే తోచు నుత్సాహసం
పన్నవ్య సాహిత్య పాలనమున
పిన్నలూర్ధ్వ ముఖంబు పెద్దలధోదృష్టి
ఉభయ భాగ్యోపాస్తి నుత్తమాపు
ఈయభావ వేదాంకామే మీయగలదు
చావు బ్రదుకుల తేలుసీ సంధి యందు
నాదు జాతి - నా దేశము - నాదు భాష
అను అహంకార దర్శన మందు మాంధ్ర.

ప్రజలలో ఈర్ష్యా ద్వేషాలు పెరిగి పోయాయి. మన విశ్వ విద్యాలయమువారే తెలుగును సవతి బిడ్డ వలె చూస్తున్నారు. మార్గదర్శకులు కావలసిన కవులు

పరస్పర రంధ్రాన్వేషణా సక్తులై సత్యదూరులుగా వున్నారు. వృద్ధులు ఆచార వ్యామోహ బంధితులై అధోముఖులైనారు. పిన్నలు విదేశీభాషా, నాగరికత వ్యామోహితులై ఊర్ధ్వదృష్టి కలిగియున్నారు. ఈ నాటి చావు బ్రతుకుల సమరంలో ఈ పరిస్థితులు యే స్ఫూర్తి నివ్వగలవు. అందుకే పూర్వ వైభవమును జ్ఞప్తికి తెచ్చుకొని నా దేశము- నా భాష- నా జాతి అని గర్వంగా చాటుకోమంటున్నారు శ్రీ రాయప్రోలు వారు,

తన "ప్రబోధము"లో 2800 సం॥ (చంద్రగుప్త మౌర్యుని) కాలము నుండి ఆంధ్రుల చరిత్ర సంస్కృతిని కళ్ళకు కట్టినట్లు వివరించారు.

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగా
బలు శస్త్రశాలలు నిలుపునాడు
విద్యానగర రాజ వీధులన్ కవితకు
పెండ్లి పందిళ్ళు కప్పించునాడు,
పోట్నూరికి సమీపమున ఆంధ్ర సామ్రాజ్య
దిగ్జయ స్తంభమెత్తించునాడు'
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్యదీక్షా ముఖ స్ఫూర్తి తీవరించె
ఆ మహా వేళ మర్ధించి యాంధ్రులార!
చల్లుడాంధ్రలోకమున నక్షతలునేడు.

ఇందు సుమారు క్రీ॥ పూ॥ 200 సం॥ నాడు మొదలైన శాతవాహనులు, కాకతీయులు, విజయనగర సామ్రాజ్యాధినేతలు వివరించ బడ్డారు.

ఆయనబరవడిలో శ్రీ విశ్వనాథ తన ఆంధ్ర పౌరుషములో

"గోదావరీ పావనోదారవాః పూర
మఖిల భారతము మాదన్ననాడు
తుంగ భద్రాసముత్తుంగ రావముతోడ
కవుల గానము శ్రుతి గలయు నాడు
పెన్నానది సముత్పన్న కైరవ దళ
శ్రేణిలో తెన్గు నిద్దిదు గానము తోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు
అక్షర జ్ఞాన మెరుగదో యాంధ్రజాతి
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు.

అని గొంతెత్తి గానము చేసిరి.

"ఆంధ్రమాత" అనే ఖండ కావ్యములో ఆంధ్రభూమిని గూర్చి

రణరక్త బంధు బారుణమైన ఖడ్గతి
క్కన కత్తి కడగిసి కథన భూమి
అమృతాకర్ష వికాసమయిన యాసుకవి పో
తన లేఖని ప్రకాస్తి గనిన చోటు
భాషాకుమారి కప్రపు పెండ్లియిల్లైన
కృష్ణ రాజ్యము వెలింగిన తలమ్ము
నానావిదేశ నౌకాసీక విపులాశ్ర
యంబైనరేవు రూపతిన తావు
పాడయి, శిలావ శిష్టమై పాత్తికాల
మను భవించుచు నుండియు నక్కట కట
బ్రతికి చెడ్డి యాంధ్రుల పూర్వవైభవములె
చాటుచున్న వాలింవుడు శాంతి మతుల."

అని ఖడ్గ తిక్కన, పోతన, శ్రీ కృష్ణదేవరాయలును మోటుపల్లి మెదలైన రేవులను కీర్తించి ఇంకా

"తన గీతి అరవ జాతిని గాయకులను గా
దిద్ది వర్ధిల్లిన తెనుగు వాణి,
తన పోటులు విరోధి తండంబులకు సహిం
పనివిగా మెఱసిన తెనుగు కత్తి
తన యందముల ప్రాంత జనుల కభిరాబి
వాసన నేర్ప నలరిన తెనుగు రేఖ
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ

లను జేయు జెలగిన తెనుగు భూమి
ఆస్మదార్ద్రి మనోవీధి నావహించ
జ్ఞప్తి కెలయించు చున్నాడ! చావలేదు
చావలేదాంధ్ర జన మహోజ్వల చరిత్ర
హృదయములు చీల్చి చదువుడో సదయులార!"

త్యాగరాజు, శ్యామ శాస్త్రిల సంగీత ఝరులు పొరుగు రాష్ట్రాల్లో వ్యాపించి ఇప్పటికీ చెక్కు చెదరక కొందరి జీవనాధారమైన రీతిని, పరాయి పాలనను తమ శౌర్య పరాక్రమాలతో పారద్రోలిన విధము తెనుగు దేశపు చిత్రకారులను, ఆంధ్రదేశపు జీవనదులైన కృష్ణ, గోదావరి, తుంగభద్రా నదులు పొరుగు రాష్ట్రాలను సైతం సస్యశ్యామలము గావించు రీతిని ఒక్కసారి తిరిగి స్మరించి మీ మనో నేత్రాలతో అవలోకిస్తే మీకే తెలుస్తుంది. మన రాష్ట్రమహోజ్వల చరిత్ర సంస్కృతి ఇంకా మరణించ లేదని, అవి మీ హృదయాల్లో పదిలంగా దాగి వున్నవని రాయప్రోలు వారు అన్నారు. ఇది నిద్రాణమైన పౌరుషాగ్నిని రగుల్కొల్పి కర్తవ్యోన్ముఖులను చేయటానికే ననిపిస్తుంది.

పూర్వ ఔన్నత్యమును స్మరించుకు సంతోషించుటే కాదు. మరల ఆనాటి ఆంధ్ర దేశము యే స్థితిలో వుందో ఆ స్థితిని పునః సృష్టిచేసి ఆనందముతో గర్వ సూచకముగా తలలూపాలని, అంతవరకు ఆంధ్ర జాతికి విశ్రాంతి లేదని ఇలా అన్నారు, "ప్రబోధము"లో

"మాచి సంతోషమున తలలూచి గర్వ
మాచి, ఆంధ్ర పుత్రీ పుత్రులందగలరు.
శాంతి నందాక లేదు విశ్రాంతి మనకు
కంకణ విసర్జనల కిది కాలమగునె!

ఈ విధంగా లక్ష్యాన్ని ప్రబోధించిన రాయప్రోలు లక్ష్యసాధనకు "పుస్తకము" అనే ఖండ కావ్యములో మార్గాన్ని చూపించారు.

ఆచారమునకు దాస్యము చేయుచును వంట
యిల్లుదాటి రాని పూర్ణేందుముఖుల
ఉదయాస్తమయములు నొడలి చెమ్మటలోడ్చి
క్షేత్ర సేవలు చేయు సేద్యగాండ్రు.
బ్రతికినన్నాళ్ళు తీరని కస్తి రెక్కలు
విరిచి జీవించెడు పేద జనుల
తన వచో వీధులన్ తాక రాదనుచు దు
ర్గతుల ద్రోసిన చెప్పరాని వాండ్రు
పూలతో నిండి కమ్మదనాలు చిమ్ము
పుస్తక నికుంజ పుంజాలి పొంత బిలచి
నా జనము, నాది దేశ మనంగజాలు
ఇంత జ్ఞాన దాన మిమ్ము తల్లి."

స్త్రీలు అక్షర జ్ఞానశూన్యులై, ఆచార శృంఖలా బద్ధులై అజ్ఞానాంధకారములో మగ్గుచున్నారు. ముందుగా వారికి జ్ఞానము కలుగ చెయ్యాలి. అందే స్త్రీవిద్యను ప్రోత్సహించి, దానికి అనుకూల పరిస్థితులు కల్పించి వ్యాప్తిచెయ్యాలి. స్త్రీవిద్యా వ్యాప్తికి కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేసిన కృషిని గూర్చి వేరే చెప్పనక్కరలేదు. ఆనాటి స్త్రీకి వంటయిల్లెస్వర్గము. సమాజం మారినా ప్రపంచము ఎంతో పురోగమించినా వీరి స్థితిలో యే విధమైన మార్పు లేదు. వీరు మారితే భావితరాలలో మార్పు వస్తుంది.

అన్నపూర్ణలాటిది ఇల్లాలైతే పంటలు పండించే వాడు రైతన్న. పగలంతా పొలంలో రెక్కలు ముక్కలు చేసికొని శ్రమించినా పంట చేతికొచ్చాక చెప్పుకోదగ్గ ఫలితం లేక బక్కరైతు తరతరాలకు పేదరికంలో మగ్గుతూ, అప్పులపాలై దీనస్థితిలో వున్నాడు. రైతులస్థితి బాగుపడాలి. గ్రామోద్ధరణ జరగాలి. అనాడే గాంధీ వూహించిన రామరాజ్యం వస్తుంది. మనిషి మనిషిని తాకరాదనే మహామారిలాటి అంటరానితనమును నిర్మూలించాలి. వీరంతా నా జనము వీరితో నిండినదే నాదేశము అనే జ్ఞానము

తనకు, మనకు కలిగించమని రాయప్రోలు వారు దేశ మాతను ప్రార్థించారు.

భారతదేశం స్వతంత్రాన్ని పొందిన తరువాత ఈవిధంగా వుండాలని ఆయన 'సత్తాక జయంతి' అనే గేయంలో యీ విధంగా కోరారు.

"నరుని స్వాతంత్ర్యమై నారీ స్వతంత్రమై
అర్థస్వతంత్రమై వ్యక్తి స్వతంత్రమై
తెగునె నీ సూతంబు ఓ సుస్వతంత్రమా !"

* * * *

"పూజింపరే రెడ్డిరాజులు వీర శృంగార
హారమ్ముల కన్కలిచ్చి
సేవింపరే కమ్మ సేనాపతులు శత్రు
రక్తకుంకుమల నరణ మొసంగి
వెలయింపరే వెల్మవీరులు బొబ్బిలి
ఓడ్డలై పరసీమ గొడ్డువోవ
అర్చింపరే బ్రాహ్మణాచార్య భయభా
షా వ్యవసాయ సస్యమ్ము లెత్తి
ఈ మహాంధ్రదేశ భగవతీమ తల్లి
నాది నుండి సామ్రాజ్య సమాప్తి దాక
కులము దడివిరె, పొలిమేర గోలబడిరి
బోయపలె తల్లి పల్లకీమోయ మాంధ్ర"

అని 'ఆంధ్ర' అనే ఖండకావ్యములో వివరించారు. ఆనాడు, ఈనాడు అంటురోగమువలె విడవనిని కుల తత్వాలు ప్రకాశం పంతులుగారు తన జీవిత చరిత్రలో బ్రాహ్మణ నాయకులు, బ్రాహ్మణేతర నాయకులు అను రెండువర్గాలు రాజకీయాల్లో కూడా వుండేవని. బ్రాహ్మణేతర నాయకులుతమకు ప్రత్యేక నియోజకవర్గాలుకావాలనిపట్టు పట్టారని వ్రాసారు. ఈ నాటికీ మనం వివిధ కులాల్లో అనేక సంఘాలు చూస్తున్నాం అందరూ దేశసేవ సంఘసేవ చేస్తామంటున్నారు అన్ని కులాలలోను ఉత్తములు. యోగ్యులు, రాజులు, వీరులు, కవులు వున్నారు. దేశసేవకు కులము అడ్డురాకూడదని ఆయన హెచ్చరించారు. ఇవన్ని ఆంధ్ర జాతి ఔన్నత్యాన్ని సాధించిడానికి మార్గాలని ఆయన భావన.

మనిషికి విశాలదృక్పథం అవసరము. కాని ఇంటగెలిచి రచ్చగెలమని పెద్దల నానుడి. ఆంధ్రులు తరతరాలుగా పొరుగు రాష్ట్రీలను వలస వెళ్ళి ఆ భాషకు రాష్ట్రానికి సేవ చేయడం పరిపాటై పోయింది. ఎంత పరోపకార పరాయణుడైనా ఎంత విశాల హృదయుడైన తను పుట్టిన నేలను మరిచి పోవటం, తన మాతృభాషను చిన్నచూపు చూడడం తన భాషలో మాట్లాడటానికి సిగ్గు పడటం విచారించ వలసిన విషయాలు రాయప్రోలు వారికి ఆంధ్రభాష ఆరోప్రాణం 'ఆంధ్ర' అనే ఖండికలో ఆయన ఇలా అన్నారు.

ప్రాకృత పదమంజరీ కంఠములు హాలు
ఓ మృత కావ్య ప్రసాదములు పంచె
బౌద్ధ సూత్రార్థముల్ ప్రవచించె నాగార్జు
నుండ హింసా ధర్మకాండ నిలపె
కన్నడ నుడికి వంకలు తీర్చిపంపను
తొలకరి రచనకు త్రోవదీసె
సాహిత్య కలశంబు క్షాళించి పండిత
రాజు క్రొంజవ్వుల క్షీరములు నించె
అన్య భాషల దూరదేశాంతరముల
నుద్ధరించి ప్రకాశించియును నిజాంధ్ర
జాతి తంతు విచ్ఛేదంబు సలుపలేదు
లేదె నీ లోన తత్త్వభాలేశ మాంధ్ర!

శాతవాహన చక్రవర్తి హాలుడు ప్రాకృతములో సంపుటీకరించిన తొలి కథా రచనలు గాథా సప్తశతి అయినా తన భాషయందు ఆయనకు గల మమకారము తో కొన్ని తెలుగు పలుకు బడులు అందులో వుపయోగించారు. ఇప్పటికీ ఈ విషయమై పరిశోధనావ్యాసాలు వస్తుంటాయి.

నాగార్జునుడు బౌద్ధమత వ్యాప్తికి కృషిచేసి మహాయాన మత వృద్ధికి స్థాపించిన విశ్వవిద్యాలయం ఆంధ్ర నడి ఒడ్డున, కృష్ణానదీ తీరాన మాత్రమే.

కన్నడ భాషలో తొలికావ్యముగా భారతమును రచించిన పంపడు మన తెనుగువాడు. సంస్కృత మహా పండితుడు ఢిల్లీ సుల్తాన్‌ల ఆస్థాన కవి అయిన పండితరాయలు మన తెనుగువాడు.

అన్య రాజ్యములలో స్థిరపడి, అన్య భాషలకు సేవచేసిన ఆంధ్రులు ఆంధ్రదేశాన్ని ఆంధ్రభాషను ఎప్పుడు నిర్లక్ష్యము చెయ్యలేదు.

ఈ భావాన్ని 'జన్మభూమి' అనే గేయంలో వివరించారు

మన దేశాన్ని వదలి మరోదేశానికి వెళ్ళినపుడు మనం ఆంధ్రులమా తమిళులమా, కాశ్మీరీలమా అని కాక నేనొక భారతీయుడ్నని మాత్రమే గుర్తుంచుకోవాలి. అక్కడ విదేశీయులతో మన రాష్ట్రసమస్యలను దేశసమస్యలను మాట్లాడకూడదు.

"ఏ దేశమేగినా, ఎందుకాలిడినా

———————————

పొగడరా నీ తల్లి భూమి భారతిని"

అని 'జన్మభూమి' గేయంలో అన్నారు

నీవు భారతదేశం విడిచిన మరుక్షణం నీమనస్సులో భారత ఖండంయొక్క రూపమే కాని ఆంధ్రదేశము కాదు. కాని నీవు పాడవలసినది "నీ తెన్గు బాలగీతములు

తల్లిగర్భమునుండి భూమిన పడిన తరువాత తొలిసారి నేర్చిన "అమ్మా" అనే మాట తెలుగు మాట. రాష్ట్రపు ఎల్లలు దాటగానే నీ భాషను మరచిపోకు. దేశంకాని దేశంలో వున్నా నీ భాష తెలుగుభాష. నువ్వు భావించవలసినది అఖండ భారత దేశము. నీవు పాడవలసినది భారతదేశ కీర్తి.

నీవు సంపన్నదేశాలకు వెళ్ళినా, వైజ్ఞానికంగా పురోగమించిన దేశాలకు వెళ్ళినా, మేధావులను కలిసినా నీవు భారతీయుడవని చెప్పుకోవడానికి సిగ్గుపడకు నీదేశం నిన్నుచూసి గర్వపడేలా ప్రవర్తించు.

"నిలుపరానీ జాతినిండు గర్వంబు."

అని రాయప్రోలు వారు ప్రబోధించారు.

నాదేశం, నాజాతి, నాభాష అన్న భావాలు తమదృష్టితికి దోహదం చేస్తాయి. అదే భావం పరభాషోన్నతిని చీదరించుకొని స్వోత్కర్షకు, పరాపకర్షకు ప్రాతిపదిక అయితే జాతీయ దురహంకారముగా పరిణమిస్తుంది రాయప్రోలు వారి తరువాతి తరాంలో ఇదే జరిగింది

రాయప్రోలు వారు తన దేశ భాషలను కీర్తిస్తున్నప్పుడు ఇతర భాషలను చిన్నచూపు చూసినట్లు కనిపిస్తుంది. గాఢ నిద్దురలోవున్న ఆంధ్ర జాతిని మేల్కొల్పటానికి స్మృతి మించినట్లు తోచినా ఆయనని సంకుచిత దృష్టిగా భావించనక్కర్లేదు. అప్పటి పరిస్థితుల్లో అలా చేయక తప్పలేదనిపిస్తోంది.

శ్రీ రాయప్రోలు వారు శాంతినికేతన్ విద్యార్థి, కవీంద్ర రవీంద్రనాథ్ ఠాగూర్ శిష్యులు.

కాళిదాసు మేఘసందేశం, ఉమర్‌ఖయాంరుబాయత్, ఆలివర్ గోల్డుస్మిత్, హెర్మిట్‌లను తెలుగులోనికి అనువదించిన మహనీయుడు. ఆంగ్ల Romanic Poetry భావమును తెలుగుభావగీతాలుగా నిల్పిన మహావిజ్ఞాని.

తెలుగు మాన్యం అనేఖండ కావ్యములో

"పరిణత వాక్కలస్మద నవ్యకళా కవితా
పితామహాల్
స్థిరముగ నిబ్బరీ తెనుగుదీమన మాన్యము
నిందు నూత్నవ
లరులను, క్రొత్త యంట్లను ఫలద్రుమ
జాతులనాటి పెంతు సం
బరమున వన్యప్రియులు మంచెలపై
నెలుగెత్తి పాడగాన్."

అని అన్నారు. తెలుగు తియ్యని మాన్యములో క్రొత్తవైనపాదులను, క్రొత్త అంట్ల రకములను పెంచుతాను అన్నారు. ఇవన్నియు ఆయనకావ్యములు. ఆ తోటలో మనమూ విహరించి ఆ సువాసనలను ఆఘ్రాణించి, ఆ ఫలములను ఆరగిద్దాం. ఇదే నా స్వాగతం.

# భావకవి బాపిరాజు—ప్రణయ కవిత్వం

వి. సిమ్మన్న

ఆధునికాంధ్ర సాహిత్య రంగంలో పాశ్చాత్యభాషా సంపర్కం వల్ల భావ కవిత్వం ఉద్భవించింది. ఆంగ్ల కవులైన షెల్లీ, కీట్సు వర్డ్స్‌వర్త్, రవీంద్రుడు మొదలైన వారి ప్రభావం ఆధునిక తెలుగు కవిత్వం పైన పడింది. ఆ ప్రభావ ఫలితమే భావ కవిత్వమను పేరుతో Romanticism తెలుగు కవిత్వంలో బయలుదేరి దినదిన ప్రవర్ధమానమై వర్ధిల్లింది. ఆంగ్లంలోని కాల్పనిక కవుల వలె ఆంధ్రం కవిత్వం వ్రాసిన వారిలో శ్రీ గురజాడ అప్పారావు గారు.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు, శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు, శ్రీ దువ్వూరి రామరెడ్డి గారు శ్రీ బసవరాజు అప్పారావు గారు, శ్రీ నండూరి సుబ్బారావు గారు, శ్రీ నాయని సుబ్బారావు గారు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు, శ్రీ గుఱ్ఱం జాషువా గారు, శ్రీ తుమ్మల సీతారామ చౌదరి గారు. శ్రీ కవికొండల వెంకటరావు గారు, శ్రీ అడవి బాపిరాజు గార్లు ముఖ్యులు,

భావ కవితా యుగంలో బాపిరాజు గారికి ఒక ప్రత్యేక స్థానం ఉంది భావ కవిత్వం ప్రసంగం వచ్చే సరికి మనకు బాపిరాజు గారు దర్శనం యిస్తారు. భావ కవి బాపిరాజు గారి కవితా భావాలను క్రమంగా 1. ప్రణయ కవిత్వం, 2. ప్రకృతి కవిత్వం, 3. దేశభక్తికవిత్వం, 4, భక్తి కవిత్వం,5. సంఘసంస్కరణ కవిత్వం, 6. స్మృతి కవిత్వం అను ఆరు శాఖలుగా విభజించవచ్చు. ఇప్పుడు బాపిరాజు గారు తన రచనల్లో ప్రణయ కవిత్వం ఎలా ప్రతిబింబింపచేశారో తెలుసుకుందాం.

మానవ జీవితానికి పరమావధీ ప్రేమ. భగవంతుని వలె ప్రేమకు కూడా నాశనం లేదు. సృష్టి ఉన్నంత వరకు ప్రణయం దేదీప్యమానంగా వెలుగుతుంది. ఈ ప్రణయం భావకవుల ఊహలను ఉజ్వలింపచేసింది. తత్కారణంగా వారి రచనల్లో ఊహాసుందరులకు సముచిత స్థానం ఏర్పడింది, భావకవులు ఊహాసుందరును తనివితీర పూజిస్తారు. చివరకు ఆమె దర్శన భాగ్యం కలుగుతుంది, దానితో వారు మురిసిపోయి ఊహా ప్రపంచంలో తేలియాడుతారు. అలా మురిసిపోయిన వారిలో దేవులపల్లి, విశ్వనాథ, తల్లావజ్ఝల, నాయని, అడివి బాపిరాజు గార్లు ముఖ్యులు.

భావ కవిత్వం లోని ప్రణయావస్థలను డా. సి.నా.రె. గారు పది దశలుగా విభజించారు. (ఆధునికాంధ్ర కవిత్వం- సంప్రదాయములు : ప్రయోగములు: పుట. 337-356) అవి యివి. 1. స్వచ్ఛంద ప్రణయం, 2. పూర్వ రాగం, 3. సంయోగదశ, 4. ఆశాభంగం విరహ విప్రలంభం, 5. విషాద స్థితి, 6. పలాయన తత్త్వం, నిరాశా వాదం, 7. విషాదమాధురి, 8.ఊహా ప్రేయసీ సృష్టి, 9. ప్రేయసీ పూజ్యత, 10. కులపాలికా ప్రణయం. బాపిరాజు గారి ప్రణయకవిత్వంలో కులపాలికాప్రణయంతప్ప తక్కిన తొమ్మిది ప్రణయావస్థలు చోటు చేసుకున్నాయి. కులపాలికా ప్రణయం సూచనామాత్రంగా చూచించబడింది.

## 1. స్వచ్ఛంద ప్రణయం

బాపిరాజు గారు స్వచ్ఛంద ప్రణయానికి అను గుణంగా ప్రేయసిని అన్వేషించి, ఆమెను ఆరాధిస్తారు. ఆమె అంగాంగసౌందర్యాన్ని కాక ఆత్మసౌందర్యాన్ని ఆస్వాదించారు. ఈ స్వచ్ఛంద ప్రణయం బాపిరాజు గారి ప్రణయ కవిత్వంలో మొదటిది.

## 2. పూర్వరాగం

బాపిరాజుగారు తాను ప్రేమించిన ఆశయదేవి ఊహాసుందరి, దర్శనభాగ్యం కోసం ఎదురుచూస్తారు. తన సుందరి ఎంత అన్వేషించినా కనబడదు. అప్పుడు తన బ్రతుకే అన్వేషణగా మారుతుంది. ఆమెకోసం తిరగరానిచోట్లు తిరుగుతారు. లాభం లేకపోతుంది. ఆమె రాకకోసం నిరీక్షణ మొదలు పెడతారు బాపి రాజుగారు.

నీకై ఎదురు చూస్తి
నీకై నే వెదికినాను
కను తెరచిన కలలమధ్య
కనులెరుగని గాఢనిద్ర
నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదికినాను

— — — —

ఆమెను వెదుకుతు చివరికి అలసిపోయి వెదకలేనే రాణి నిన్నూ, వేదనా పూర్ణమా బ్రతుకులోనూ! అని ఆవేదన చెందుతారు. కలలోనే వచ్చి కలలో కరిగి పోతుందిగాని ఊహాలకు అందదు. ఈ విధంగా బాపి రాజుగారు ఆమెదర్శనభాగ్యం కోసం ఎదురుచూస్తారు.

## 3. సంయోగం

ఒక శుభ మాహుర్తాన ఊహాసుందరి బాపిరాజు గారికి

ధవళకాంతి తరళమూర్తి
భువనసకల మోహమూర్తి
ప్రణయదేవి నా శశికళ
మృణాళాంగినా శశికళ
పూర్ణనగ్నమై నిలిచెను
చూర్ణకుంతలాలాడగ

ప్రవిమలమూర్తి పరమశోభ తానముంచు బాపి రాజుగారిముందు నిలబడుతుంది. ఆమెరాకతో దివి, భువి తరించాయి, గోదావరి పాడింది, గోవత్సం ఆడింది. చదలదేవి స్వర్ణాక్షరాలతో దీవించింది.

నగ్నబాల నా శశికళ
నగలలంకరించనికళ

— — — —

అని ఆమెను, ఉద్రిక్తతతోగాఢమైన కౌగిలింతలో మునిగిపోయేరేకాని సంయోగదశకు దిగలేదు. బాపి రాజుగారు ఆమె అపురూప సౌందర్య లావణ్యాన్ని పువ్వుల గుత్తులతో పోల్చి నీరాజనం చేశారు.

## 4. ఆశాభంగం—విరహావిప్రలంభం

తన ఆశయ దేవి కలలో మెదలి తళుక్కుమని మాయమై పోతుంది. తానంతకుముందు తెరమీ దానిన నీడనుచూచి, తెరచాటున పాటను విని ఒక్కసారిగా మాయమైన సుందరరూపాన్ని మనసులో నుంచుకొని ఆ సుకుమార సుందర స్వరూపంకోసం కొండలు, కోనలు వాగులు తిరిగారు బాపిరాజుగారు. ఆమె కాన రాదు. ఆమెను చూడాలనే తపన ఎక్కువవుతుంది. ఒక అద్భుతమైన తెరసృష్టిస్తారు. ఆమెకును తనకును మధ్యనున్న భౌతిక రూపబంధాలను తెరగా భావించు కొని

ధవళమైనదీ తలపు దాటినది
దానికి మొదలూ చివరాలేనిది
నీకు ఇవతల
నాకు అవతల
తెర ఉన్నాది బాలా !
తెర ఉన్నదే !

కన్నులు రూపం పిలిచి కౌగిలి కందని భావం తలచుకొని, తెరవైపున చేతులు మోడ్చి, కలలు అర మూతలుగా మిగిలిపోయి చీల్చిన చిరగని గట్టితెర ఉండడంచేత తాను ఇవతలనుండి ఆవతలకు చేరుకో లేక పోయానని ఆశాభంగం చెంది వియోగబాధను

ప్రకృతి పథములు నడచి
భావలోకము గడచి
బహుదేశములు విడిచి
పడినాను అడివిలో
ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినాను !

అని తన ఒంటరిజీవితంలో ఆవేదనను అనుభ విస్తారు. చివరికి

ననుజూసి నవ్వేవు
కనుమూసి పోయేవు
నాబాధ నాలోనె
నాగాథ నాకెనె
-- -- -- --

అని విరహంలో విప్రలంభశృంగాన్ని అనుభవి స్తారు బాపిరాజుగారు.

## 5. విషాదస్థితి

తనప్రియురాలు తనకు దూరమయ్యే సరికి బాపి రాజుగారికి వియోగ దుఃఖం భరింపరానిదిగా తయా రవుతుంది. అప్పుడు

ఏల కోపం వచ్చినదో, నీ
ప్రోల నిలచిన నన్ను చూడవు
బాలికా నావైపు తిరగవు
పంతగించితవో !

అని బాధను వ్యక్తం చేస్తారు. తాను చేసిన తప్పు తనకె తెలియ రాకున్నదని ప్రాణకాంత పాదపద్మంల ప్రోలవ్రాలి.

ప్రణయ లీలల
ప్రథమ తప్పిద
యెట్టిదైనను
ఏరికైన, క్ష
మార్హమే కాదా

తాను చేసిన తప్పును ప్రణయలీల మొదటితప్పుగ నెంచి, క్షమాభిక్ష పెట్టమని కోరుతారు. బాపిరాజుగారు ఆమెను దర్శింపలేని తన జీవితం భరింపరాని బాధగా తయారయ్యే సరికి నిందలు మోపుతారు.

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
సుక్కిపోయి సోలియుంటి
మక్కువ ఇంతైన లేని అక్కసురాలా !
టక్కులాడివై పోతివె
చక్కనిదానా !
— — --

అని భరింపరాని వియోగబాధను అనుభవిస్తారు బాపిరాజు గారు.

## 6. నిరాశావాదం

కుంచెలతో రంగులతో కొలువచేరినప్పటికి శశికళ దర్శనభాగ్యం కలుగదు, తనివితీర గొంతెత్తి పిలిచినా ప్రేయసి పలుకదు. ఎన్నిసార్లు కొండలుతిరిగి కోనలు వెదికినా తన ప్రణయదేవి కానరాదు. అప్పుడు

మరచిపోవ బోకెజాల
మరచిపోవకే!
అరచి అరచి పిలువలేను
తరచి తరచి వెదకలేను
పరచి ఎగురు కాంక్షలలో
పడి చెదురును నా గుండెలు
మరచిపోవకే !

అని నిరాశ చెందుతారు. శశికళను వెదకలేక వేసారిన బాపిరాజు గారు

అధివసింపరావు నీవు
అవతరింప ఒప్పుకున్న
ముందుయుగపు రసికాత్ములు
ముందుయుగాల సహృదయులు
పాడుపడిన సౌందర్యము
పరికిస్తూ నిట్టూర్తురు

అని అంటూ ఆమెను సంప్రార్థిస్తారు. హృదయాన కుములేటి బాధలు మంటలుగా మారి ప్రేమకథగా మిగిలిపోయిందని వాపోతారు.

సంగీత మేలనే
పొంగేటి లయలేల
సంతోషమేలేని జన్మకిక
సంగీతమేలనే !

శశికళ లేని ఈ జీవితం వృధా అని తనని కుంగదీస్తున్న నైరశ్యాన్ని గొంతెత్తి పాడుతారు బాపిరాజు గారు.

## 7. వియోగమాధుర్యం

బాపిరాజుగారు విషాదంలో కూడా వియోగ మాధుర్యాన్ని అనుభవిస్తారు.

నీకే గురువును నేను
శ్రీ కమల పరిమళా
దేశికుడ ప్రియుడనై ఆశించి భాషించి
దీక్షలో శిల్పవిన్యాస పులకితుడనై

— — — — —

అని అంటారు, తన ఊహాసుందరికి గురువై, ప్రియుడై, దీక్షలో శిల్పవిన్యాసపులకితుడైనారు. ఏ ముహూర్తబలమో, ఏపూర్వ జన్మ ఫలమో వల్లనో అమృత వాహిని మాదిరిగా అవతరించి దీనుడనైన నన్ను దివ్య భూములకు తీసుకెళ్ళి పోయిందని వియోగంలో మాధుర్యాన్ని అనుభవిస్తారు బాపిరాజుగారు.

తన సుందరి తనను వియోగంలో ముంచి వెళ్ళిపోయినా బాపిరాజుగారు ఆమెతో కలిసిన పూర్వ స్నేహంవలననే తన బ్రతుకు పరిమళార్ద్ర నందనోద్యానవనంగా తయారయ్యిందని అంటారు.

నా బ్రతుకొక పరిమళార్ద్ర
నందనోద్యానవనము
నందనాననిహరించె సుందరివే ప్రేమరాణి !

— — — — —

తన శశికళ తనలో నిత్య యౌవనం దాల్చినదని తాను మాత్రం, ఏళ్ళు జీర్ణింతునని తన వియోగమాధుర్యాన్ని వ్యక్తంచేస్తారు బాపిరాజుగారు.

నాలోననీవూ నిత్య యౌవనవూ
ఏనుమాత్రం దేవి ఏళ్ల జీర్ణింతునే ?

— — — — —

తన ఊహాసుందరి తనకు దూరమైనప్పటికినీ ఈవిధంగా బాపిరాజుగారు వియోగంలో మాధుర్యాన్ని అనుభవిస్తారు.

## 8. ఊహాప్రేయసి సృష్టి

బాపిరాజుగారు చిన్నతనంనుంచి సౌందర్యరాశిని ఊహాప్రేయసిగా సృష్టించారు.

చంద్రలోకం తూర్పుదెసలో
సూర్యలోకంలో పశ్చిమంలో
చిన్నలోకం ఒక్కటి ఉన్నాదే
ఓనా వెన్నెల చిన్నారి పడుచా !
ఆలోక మేదే
కన్నెరాణివి నువ్వేమవ్వేనే

చంద్రలోకం తూర్పుదెసలో, సూర్యలోకం పశ్చిమదెసలో ఉన్నచిన్న లోకాన్ని ఏలే కన్నెరాణి "శశికళ"అని చెప్పారు.

ఊహా ప్రపంచంలో విహరించి, స్వప్నంలో అపురూప సౌందర్యరాశిని, స్త్రీమూర్తిగా సృష్టించి, ఆమెను కళకు దేవతగా, రసాధి దేవతగా, దిశామూర్తిగా, నిశామూర్తిగా, ప్రణయమూర్తిగా, తేజోమూర్తిగా భావించి తన హృదయ సామ్రాజ్యాన్ని ఏలే మహారాణిగా ఎన్నుకొన్నారు బాపిరాజుగారు. ఆయన శశికళా ప్రియులు. ఆయన శశికళా సృష్టిఅపూర్వం.

**9. ఊహాప్రేయసీ పూజ్యత**

బాపిరాజు గారు తన ప్రేయసికి పూజాపీఠంపై అధిష్ఠింపజేసి

పొద్దుపొడుపూ తొగరుకెమ్మోవి
ముద్దుమోమే మెయిల తెరవూ

— — —

మంటిమింటికి శ్రుతికి గా నా తలపూ!
నా ఆత్మ మధ్యపు
అమృత మూర్తివి నువ్వే నువ్వేనే!

అని కీర్తించి వెల్లువై వచ్చావు ప్రేయసీ వెన్నెలై వచ్చావు ప్రేయసీ అని ఆతిథ్యమిచ్చి అతిథి సత్కారాలు చేసి పూజ చేస్తారు బాపిరాజు గారు

అందుకోవేమే శశికళా!
నా పూజ
సుందరివి నీవె కాదంటవె!
ప్రణయ పళ్ళెర మందు
పండ్లు కాంక్షలగములు
చూపు పూవుల సరులు
ఊపిరేధూ పాలు
అందుకోవేని

తన శరీరాన్ని దేవాలయంగా చేసి మనసును ఆసనంగా తయారుచేసి, తన గీతాలను మంత్ర జపంతో కలలను హారతిగా ఇచ్చి కళను నివేదించారు. కళామూర్తి బాపిరాజు గారు.

తన ఊహా సుందరి విమల గాంధర్వం పావన గంగోత్రం సందుర్భవించిన నిర్మలమైన మందాకిని వలె ఆవిర్భవింపగా ఆలనాటి భగీరథునివలె ఆనంద పరవశులై నిలువెల్లు ఉప్పొంగిపోయినారు

ఆమె గానమాధుర్యం ముల్లోకంలనింద

'అమృతాప్లావితతనూ కమనీయ మూర్తి'యై 'నిత్యవిద్యా హృదయ మృత్యుంజయు'లైనారు. ఆమె సంగీత పరమ శోభాకాంతి దిగంతాలకు వ్యాపించగా బాపిరాజుగారి మూలాలు పులకరించినవి. అప్పుడు బాపిరాజుగారు అబ్రవిగ్రహుడ శబ్దబ్రహ్మయై ప్రణయ స్వరూపిణి శశికళా దేవిని పోదవికున్నారు. ఆ సమయాన 'వనధికాలకాంబుధై జనులెల్లదైవులై' నారు. బాపిరాజుగారు తన ఊహాసుందరి శశికళ కలిసి పోవడాన్ని బట్టి కులపాలికా ప్రణయాన్ని సూచనా మాత్రంగా చూచించారని చెప్పొచ్చు.

ఈ విధంగా బాపిరాజుగారు తన రచనల్లో ప్రణయ కవిత్వాన్ని రచించారు.

వి. సిమ్మన్న
ఎం.ఏ;డి.బి.యస్;డిప. హెచ్
రీసెర్చి స్కాలర్
డిపార్టుమెంటు ఆఫ్ తెలుగు
ఆంధ్ర యూనివర్శిటీ
వాల్తేరు—530003

# తూర్పు గోదావరి మండలము గ్రామనామము సమీక్ష

— కోటి సూర్యనారాయణమూర్తి

ఆంధ్ర సాహితీ రంగమున పరిశోధన నేడు రెండు విధములుగా జరుగుచున్నది ఒకటి భాషాశాస్త్ర పరము గానూ, మరొకటి సాహిత్య పరము గానూ జరుగు చున్నది. గడచిన కాలములో సాహిత్య పరముగా పరి శోధన ముమ్మురముగా జరిగినది. కారణము ఆనాటి సాహిత్య వేత్తలు సామాజికులు సాహిత్యమును ఆరా ధించి నెంతగానో ఆదరించినారు అంతటి నాదరణ భాషా శాస్త్రము మీద లేకపోవడము వలన ఆ శాస్త్ర ము అభివృద్ధి చెందలేదు. నిజానికి సాహిత్యమునకు శాస్త్రమునకు అవినాభావ సంబంధమున్నది. సాహిత్య ములో శాస్త్రము నిగూఢముగా దాగియున్నది. సాహిత్య వేత్త కావ్యమును సాహిత్య పరముగా పరిశీలిస్తే పురా ణకాలక్షేపము, విమర్శ సాహితీ సంపద లభిస్తాయి. గాని అదే కావ్యమును శాస్త్రదృష్టితో పరిశీలిస్తే ఆ కావ్య కథా కాలమునాటి భాషా సరళి నాటి ప్రజల వ్యవహార సరళి ఆ కావ్యపటిష్టత వేయేల ఆ కావ్యము నందలి పూర్తి హంగులను క్షుణ్ణముగా పరిశీలించ ఫలితములను తెలియ జేయడానికి అవకాశమిస్తుంది. గడచిన కాలములో శాస్త్రము మీద పరిశోధన మిత ముగా జరిగినప్పటికినీ ఈ నవీన కాలమున భాషా శాస్త్రము మీద పరిశోధన అమితముగా జరిగినది జరుగుచున్నది.

భాషా శాస్త్ర పరిశోధనలో ఈనాడు కేవలము భాష మీద పరిశోధన మాత్రమే గాక స్థలనామములు వ్యక్తి నామముల మీద గూడా పరిశోధన చేయుచున్నారు. వ్యక్తుల నామముల గురించి చేసేపరిశోధనను "ఆంత్రో పోనిమి" యనియు, స్థలలేదా గ్రామనామముల గురించి చేసే పరిశోధనను "టోపోనిమి" అని యందురు. అంతేగాదు. ఇటీవల ఇంటిపేర్ల మీద కులం మరియు గోత్ర నామముల మీద గూడ పరిశోధన చేయు చున్నారు.

ప్రస్తుత నాయీ వ్యాసయద్దేశ్యము తూర్పుగోదా వరి గ్రామనామములమీద సంగ్రహముగా చర్చిం చడము.

ఒక వ్యక్తిని గుర్తించడానికి పేరు ఎలా అవస రమో, అదే విధముగా ఒక గ్రామమును గుర్తించడా నికి గూడా పేరు అవసరము. పుట్టినప్పుడే వ్యక్తిగూడా పేరుతోపుట్టడు. ఆ పుట్టిన వ్యక్తికి నామ్నీకరణము ఆతడు నివశించె ప్రదేశము, భౌగోళిక పరిస్థితి, తిథి, నక్షత్రము, జాతకము ఎలా అవసరమగుచున్నవో, అదేవిధంగానూ గ్రామమునకు పేరును సూచించడానికి గూడా కుటుంబనామములు. వంశనామములు, రాజవంశనామిములు, గ్రామదేవతల పేర్లు పెట్ట బడ్డాయి. అంతేగాదు చారిత్రక పురుషుల, ఆయా ప్రాంతములలోని అధికార, అనధికార సాంఘిక, మత, రాజకీయ పరిస్థితులన్నియు గూడా పరిగణన లోనికి తీసుకొనబడి, గ్రామములకు నామ్నీకరణము జరుగుతున్నది.

ఒక పరిమితమైన ప్రాంతములో నివసిస్తున్న ప్రజా సమూహము వారు నివసిస్తున్న ప్రదేశమునకు గ్రామము అని యందురు. వారి జీవనావసరములు. సాంఘికాచారములు అనాడు ఆ గ్రామమునకే పరిమితము. అయితే అన్ని గ్రామములు స్వయంపోషకములుగావు. ఒక దాని కొకటి పరస్పర సహకారము కావలసి యుంది. ఆదికాలమున అన్నియుగూడా గ్రామములే జీవన పరిస్థితుల కనుగుణముగా యున్న భౌగోళిక ప్రదేశాల యందు మాత్రమే ప్రజాసమూహము పెరిగి అవియే నేటి పట్టణములగుచున్నవి. మానవశాస్త్రజ్ఞులకు స్థల నామపరిశోధన అత్యంత ప్రయోజన కారి యగు చున్నది. ప్రజలయందలి విభిన్నవర్గాల సాంస్కృతికవర్ణవ్యవస్థ వలసల సాంప్రదత, భాషా గత సరిహద్దులు మాత్రమేగాక, తత్సంబంధాలను గూర్చికూడా తెలియచేస్తాయి. అంతేగాదు ఏ యే ప్రదేశములను ఏ యే వంశములవారు పరిపాలించిరో, ఎవ్వరు దిగ్విజయయాత్రలు చేసి, తమ సామ్రాజ్య నెల్లలను పెంచినారో నీ పరిశోధనలవలన తెలియును.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున శ్రీ కేతు విశ్వనాధరెడ్డిగారు 1956వ సంవత్సరమున కడప మండలమున స్థలనామముమీద భాషాసామాజికముగా పరిశోధనచేసి తమ సిద్ధాంతవ్యాసమునకు పి. హెచ్ డిని పొందారు. ఈ తరహా వ్యాసములకు నీయనే శ్రీకారము చుట్టినారు.

భౌగోళికముగాగోదావరిమండలములో కెల్లా మిక్కిలి ప్రాముఖ్యత వచ్చినది తూర్పు గోదావరి. ఈ మండలమున గోదావరి వివిధ పాయలుగా చీలి మండలము నంతటా ప్రవహించుచున్నది. ప్రధానముగా పరిపాలనా సౌలభ్యము కోసము తూర్పు పడమర విభాగములు చేసినారు. ఇందనేకమైన పుణ్యక్షేత్రములతో ఉపనదులతో సారవంతమై, 1513 గ్రామములు 14 తాలూకాలుగా విభజింపబడి 10. 970 చదరపు కిలో మీటర్ల విస్తీర్ణము కల్గి 53. 592, 605 జనాభాను కల్గియున్నది.

ఈ వ్యాసములో భాషా విశేషాంశములకు అధిక ప్రాముఖ్యతనిచ్చి' భాషా విశేషాంశములను గూడా సంగ్రహముగా, నేను సేకరించిన స్థలగ్రామనామముల కొన్నింటిని దిగువ నుదహరించుచున్నాను.

**అచ్చసంధులు**

దీప + ఆర్తి — అ + అ — దీపర్తి
తోక + ఆడ -- అ + ఆ -- తోకాడ
గాదర + అడ -- అ + అ -- గాదరాడ
కోర + లంగి -- అ + ఇ -- కొరంగి
చీడి + ఇగ ఇ + ఇ -- చీడిగ
ఆరు + ఏళ్ళదార -- ఉ + ఎ -- ఆరేళ్ళదార
చేపు + ఊరు -- ఉ + ఊ చేపూరు
అటికెవ + ఏణిపాలెం, అ + ఎ-- అణికెవేణిపాలెం

**ద్విత్వలోపము**

అచ్చ + అమ్మ + పేట--అచ్చమపేట
అచ్చమ్మపేట ఎల్ల॥ తా॥
అచ్చంపేట
సుబ్బ + అమ్మ + పేట -- సుబ్బమ్మపేట
సుబ్బమ్మపేట పిఠా॥ తా॥
సుబ్బంపేట
బుచ్చ + అమ్మ + పేట--బుచ్చమపేట
బుచ్చమ్మపేట రాజ॥ తా॥
బుచ్చంపేట

**ఏకవచనము**

రేఖ (వాని) పాలెము తుని తా॥
సిద్ధ (వాని) పాలెము ప్రత్తి తా॥

**బహువచనము**

పాండవు (ల) పాలెము పెద్దా తా॥

సిద్ధ (వారి) పాలెము పెద్దా తా॥

**ద్విత్వాక్షరము**

హల్లు క్రింద అదేహల్లు ద్విత్వముగానున్న యెడల దానిని ద్విత్వాక్షరమందురు. ఇది బ్రాకెట్టుల మధ్యన చూపబడినది.

దామనప (ల్లె) క్రొ (త్త) పీదులు

గి(న్నె)లప(ల్లి) క(చ్చె) లవాడ

మ(ట్టి)వాడ రంప॥ తా॥

**వర్ణసమీకరణము**

భిన్నహల్లులు ఒక దానినొకటి సమీకరణముపొంది నందు వల్లన వర్ణసమీకరణమందురు. సజాతిహల్లు క్రిందిహల్లుగాని విజాతిహల్లు గాని నుండవచ్చును.

భో (ర్న) గూడెము

భో(ర్ల)ంక.

అ(ర్జు)నలోవ

దేవ(ర్రి)గూడెం. రంప॥ తా॥

**ఔపవిభక్తికములు**

ఇ. టి. తి. అను ప్రత్యయములంత మందున నున్న పదములు ఔపవిభక్తికములందురు.

- ఇ - వేళంగి - దివిలి - మల్లేపల్లి - ర్యాలి.

- టి - తాటిప ర్రితిరుపతి-గుంద్రాతి పుల్లేటికుర్రు, ఎఱ్ఱటికోన, విభక్తి ప్రత్యయాలు.

ప్రథమావిభక్తికి ప్రత్యేకమైన ప్రత్యయాలు లేవు. సాధారణంగా కర్త ప్రథమా విభక్తిలో నుంటుంది ద్వితీయాదులకు మాత్రమే విభక్తి ప్రత్యయములు గలవు.

ప్రథమా - డు - మేడపాడు

- ము - పెద్దాపురము.

- వు - దివాన్ చెఱువు

- లు - చేబ్రోలు

ద్వితీయాదులంతగా కానరావు

**క్రియాజన్య విశేషాలు**

నిత్య వ్యవహారములో మనము చేసే పనిని క్రియ నందురు. అటువంటి క్రియాంతమందు గల పదములను క్రియాజన్య విశేషాలందురు.

వంపు-వంచుట, ఒంక యన అర్థములో నంది వంపు- తుని ॥తా॥

పారు-ప్రవహించుట పారుపాక కాకి ॥తా॥

కుదురు-స్థిమితము-నిశ్చలము.

కుదురు-రంప ॥తా॥

నడకుదురు కాకి ॥తా॥

కరకుదురు కాకి ॥తా॥

కొండకుదురు అమ ॥తా॥

**ద్రుతము**

ద్రుతాంతమందు గల పదములు ద్రుత ప్రకృతికములు. గాని నన్నయ గారు ద్రుతమునకు స్థిరత్వమును చేకూర్చినాడు.

పైన - (న) కాకి. తా॥

ఎర్రటికోన (న) అమ. తా॥

అన్యదేశ్యములు ద్రావిడభాషా కుటుంబమునకు చెందిన తెలుగును చారిత్రాతకముగా పరిశీలిస్తే, ప్రాచీనదశలో తత్సమ' తద్భవ పదజాలము ఎక్కువగా చేరినట్లు గానవచ్చునున్నది. మహమ్మదీయుల పరిపాలనా కాలములో ఉర్దూ, అరబిక్, పర్షియన్ పదములు, పోర్చుగీసు వారి కాలములో పోర్చుగీసు పదములు, ఆంగ్లేయుల పరిపాలనా కాలములో ఆంగ్లేయపదములు వాడుక లోనికి వచ్చినవి. ఆ ప్రభావము గ్రామ నామముల మీదను చూపబడినది.

| | |
|---|---|
| ఫకురుద్దీన్ పాలెము | పితా. తా॥ |
| నవాబు పేట | ఆల. తా॥ |
| హసన్‌బాద | రామ. తా॥ |
| హుకుంపేట | రాజ. తా॥ |
| పోల్‌క్స్ పేట | రంప. తా॥ |
| నార్కెడ్‌మిల్లి | కొత తా॥ |

విశేషణములు. విశేషాలకు ముందు మాత్రమే వచ్చె అస్వతంత్ర ప్రాథమిక విశేషణములు. ఇందు పరిణామమును, క్రియను, సంఖ్యా వర్ణములను గూడా దెల్పును.

| | | |
|---|---|---|
| నవ | నవఖండవాడ | పితా॥ తా॥ |
| పాత - | పాతతుంగపాడు | రాజ॥ తా॥ |
| నల్ల - | నల్లగొండ | రాజ॥ తా॥ |
| ఉప్పు - | ఉప్పాడ | పితా॥ తా॥ |
| బురద - | బురదకోలు | ప్రత్తి॥ తా॥ |
| తాడి - | తాడితోలు | ఎల్ల॥ తా॥ |

సంఖ్యావాచక విశేషణము విశేష్యాలకు ముందు వచ్చె సంఖ్యాపూర్వకమైనవి.

బండు -బండు + రేగుల -బంద్రేగుల ప్రత్తి॥ తా॥
మూడు-మూడు + కొల్లు -ముక్కొల్లు పెద్దా. తా॥
మూడు-మూడు + గుళ్ల -ముగ్గుళ్ల రాజ. తా॥
మూడు-మూడు + కామల-ముక్కామల అమ. తా॥
ఆరు -ఆరు + ఏళ్లదార-ఆరేళ్లదార ప్రత్తి. తా॥
నూరు-నూరు + పూడి -నూర్పూడి రంప. తా॥
కోటి -కోటి + పల్లె -కోటిపల్లె రామ. తా॥

### వర్ణసూచకాలు

వర్ణవిశేషణములను తెలుపునవి వర్ణసూచకాలు :

| | | |
|---|---|---|
| ఎఱ్ఱ | ఎఱ్ఱమెట్లు | రంప. తా. |
| | ఎఱ్ఱముపాలెం | ,, |
| ఎఱ | ఎఱటికోన | అమ. తా॥ |
| నల్ల | నల్లమిల్లి | పెద్దా. తా॥ |
| నల్ల | నల్లగొండ | రాజ. తా॥ |
| ఎల్ల | ఎల్లమిల్లి | పెద్ద. తా॥ |

### పరిమాణసూచకాలు

| | | |
|---|---|---|
| పెద | పెదభీమపల్లె | రంప. తా॥ |
| ,, | పెద్దబ్రహ్మదేవము | కాకి. తా॥ |
| ,, | పెదగెద్దాడ | రంప. తా॥ |
| పెను | పెనుమల్లె | కాకి. తా॥ |
| | పెనుమర్తి | కాకి. తా॥ |
| చిన | చిన్నబ్రహ్మదేవము | కాకి. తా॥ |
| చిన | చినజగ్గంపేవ | పెద్దా తా॥ |
| చిన | చినగెద్దాడ | రంప తా॥ |
| మెఱక | మెఱకచేమవరము | ప్రత్తి తా॥ |

### దిక్సూచకాలు

దిక్కులను సూచించేది.

| | | |
|---|---|---|
| తూర్పు | తిరుపతి రాజపాలెం (తూర్పు) | |
| పడమర | తిరుపతి రాజపాలెం (పడమర) | |
| ఉత్తర | ఉత్తర కంచి | ప్రత్తి తా॥ |
| దిగువ | దిగువ దారపల్లె | ప్రత్తి తా॥ |
| దిగువ | దిగువ శివద | ,, |
| ఎగువ | ఎగువ దారపల్లె | |
| నడవ | నడవపలె | ముమ్మ తా॥ |
| వాలు | వాలు తిమ్మాపురం | పెద్దా తా॥ |

భూమి యొక్క స్వభావమును, స్వరూపమును తెలియచేసేవి కొన్ని.

| | | |
|---|---|---|
| ఇసుక | ఇసుకపాడు | ఎల్ల తా॥ |
| రాళ్ళు | రాళ్ళకంద్రిగ | పెద్దా తా॥ |
| ఉప్పు | ఉప్పాడ | పితా తా॥ |
| దీవి | గుత్తెన దీవి | ముమ్మ తా॥ |

అనంతమైన ఈ జగత్తుసంతా ప్రకృతి ఆవరించి యున్నది. ప్రకృతి తన యొక్క రమణీయత్వము చేత మరింత శోభాయానము అగుచున్నది. ప్రకృతి అంటే కేవలము రాళ్ళు రప్పలు మాత్రమే గాక పశు పక్ష్యాదులు వృక్షజాలము, శీతోష్ణస్థితి గాలి, నీరు అన్నియు గూడా ప్రకృతిలో మిళితమయి నుండును.

**వృక్షసూచకాలు**

మానవ పరిసర ప్రాంతములో వృక్షజాలము ఒక ప్రాంతమున మితంగా పెరిగియున్న యెడల, ఆ ప్రాంతమున జనులు నివశించుచున్నందువల్లన ఆ ప్రదేశమునకు సంకేతముగా ఆ వృక్షజాలము నుపయోగించుచున్నారు ఆ తదుపరి కాలమున ఆ వృక్ష సంపద నశించిపోయినప్పటికినీ,అదే పేరుతో మాత్రమే పిలువబడుచున్నది.

బూరుగుపాలెం-ఎల్ల మట్టివాడ రంప. తా॥
తుమ్మలపల్లె రంప శృంగవృక్షము తుని.తా॥
చింతలగూడెం ,, తాటిపర్తి పిఠా. తా॥

అంతేగాకుండా ఈ మండలమున ముఖ్యముగా మన్యప్రాంతమున మామిడిపంట ప్రధానమైనది. రకరకాలైన మామిడులు ఆయా ప్రాంతమున పండించుట వలన ప్రసిద్ధి చెందిన మామిడితోటల ప్రదేశమునకు చెందిన ప్రాంతమును ఆయా మామిడితోనే పిలువబడుచున్నవి. దీనినిబట్టి విశ్లేషణచేస్తే ఆనాడు ఎన్నిరకముల మామిడిపండ్లున్నాయో తెలియుచున్నది.

బట్టిమామిడి-ఎల్ల. తా॥ పందిరిమామిడి రంప. తా॥
ఆకుమామిడి-రంప. తా॥ తూరుమామిడి "
బందమామిడి- " వీర్లమామిడి "
మంజుమామిడి-" "

**జంతుసూచకాలు**

జంతువుల నివాసమునుబట్టి గూడా గ్రామనామములు సూచించడము జరుగుచున్నది.

దేగలకోలు-ఎల్ల తా॥ మెసలపల్లె-అమ ॥తా॥
సక్కలపాడు-" నాగవరము- "
హంసవరం-తుని. తా॥తొండవరము- "
గుర్రంపాలెం- పెద్దా తా॥పులియేరు-పెద్దా. తా॥
చిలకవీధి - రంప తా॥పాముగండి రంప తా॥
ఏనుగుపల్లె క్రొత్త తా॥గొఱ్ఱిపూడి - కాకి తా॥
కాకినాడ - కాకి. తా॥సర్పవరం - కాకి తా॥

**ఆహారసూచకాలు**

పండించే పంటల విస్తీర్ణమును బట్టి గూడా గ్రామనామములు సూచించడము జరుగుచున్నది.

ధాన్యముపాలెము-ఎల్ల తా॥ బెండపూడి-తుని ॥తా॥
పనసలపాలెము- ,, కాకరపల్లె- ,,
పాలగడ్డ - ,, ఉల్లిగోగుల-ప్రత్తి ॥తా॥
తోటకూరపాలెము-,, దోసకాయలపల్లె-రాజ॥తా॥
కందులపాలెము-కాకి ॥తా॥ వంగలపూడి-రాజ॥తా॥
నిమ్మలపాలెము-రంప ॥తా॥ జొన్నాడ-ఆల॥తా॥
ద్రాక్షారామ రామ ॥తా॥ మునక్కాయల
భీమవరం ఎల్ల ॥తా॥

జల సూచకాలు, నీటివాలునుబట్టి ఆ వుంటున్న స్వభావమును బట్టి గూడా గ్రామనామములు సూచించడము జరుగుచున్నది.

ఆరేళ్ళదార-ప్రత్తి ॥తా॥ చింతబాయి ప్రత్తి ॥తా॥
బాపనదార " ఈలకోలను పెద్దా ॥తా॥
శృంగదార " ఏరుపల్లె "
ఏలేరు " చెఱువుపాలెం-రంప ॥తా॥
గుమ్మిలేరు-ఆల ॥తా॥ దారిమడుగులు "

ఈ మండలము నందు గోదావరి వివిధ పాయలుగా చీలి ప్రవహించుటచే ఆ నదీ పాయలమధ్య నున్న భూమి సారవంతమయినది. అంతేగాకా నదీ పరీవాహక ప్రాంతము వలన కొంత ప్రదేశమున

చుట్టూ నీరు ప్రవహించు చుండును. ఇటువంటి ప్రదేశమును లంక లేదా దీవిలందురు ఇటువంటి లంకలు ఈ మండలమున అనేకములున్నందువల్లన వాటికి వ్యక్తి పరముగా దైవపరముగా పశుపక్ష్యాదుల పరముగా గ్రామ నామము సూచించడము జరుగుచున్నది

అప్పన్నరాముని-లంకరాజో॥తా॥గాడిలంక ముమ్మ॥తా
గుడిమెల్లంక " " కేసనకుర్రులంక ,, ,,
బతుకుర్రులంక " " కొత్తలంక ,, ,,
మెండెంపులంక " " పుతిర్లంక
పసర్లపూడిలంక " " ధాణేలంక
రామరాజులంక " " ఎదురంక

**ఆభరణసూచకాలు:**

నిత్యకృత్యములో మనము ధరించె ఆభరణములను సూచించేవి.

బిళ్ళనందూరు- తుని॥తా॥ నాగవరము అమ ॥తా॥
రాళ్ళకంద్రిగ- పెద్దా॥తా॥ వజ్రకుటం-ప్రత్తి॥తా॥
కడియము రాజ ॥తా॥

**కులవృత్తిసూచకాలు**

అనాదిగా వస్తున్న కుల వ్యవస్థ నాధారముగా సూచించేవి.

గొల్ల గొల్లప్రోలు పిఠా ॥తా॥
గొల్ల గొల్లలగుంట పెద్దా ॥తా॥
ఉప్పర ఉప్పరపాడు " ॥తా॥
ఉప్పర ఉప్పరపాలెం " ॥తా॥
గొల్ల గొల్లపాలెం " ॥తా॥
దేవాంగ దేవాంగవీధి " ॥తా॥

**వ్యక్తినామ సూచకాలు**

అనాదినుండి మన దేశమున వర్ణవ్యవస్థ బాగా వేళ్ళూనికొని యుండి. ఆ వర్ణవ్యవస్థ గూడా కేవలము వ్యక్తిపరముగానే అభివృద్ధి చెందినది. ఆ వ్యక్తి బలవంతుడయి, అధికారమును చేబట్టి ఆతని పేరన గ్రామ నామ మేర్పడడానికి అవకాశమున్నది.

బలరాంపురం రామభూపాలపట్నం పెద్దా॥తా
వేంకటకృష్ణరాయపురం మాధవపట్నం కాకి॥తా॥
ఫకరుద్దీన్‌పాలెము-పిఠా॥తా॥ భూపతిపాలెము ,,
శ్రీకృష్ణపట్నము ,, కేశవదాసుపాలెం ,,
బుచ్చెమ్మపేట ,, దామిరెడ్డిపాలెం ,,

**కుటుంబనామసూచకాలు**

సిద్ధవారిపాలెము (ప్రత్తి) తుమ్మలపల్లె
వేములపాలెం ,, చింతలగూడెం
గొల్లలగుంట ,, జగన్నాయకులపాలెం

**వంశనామ సూచకాలు**

ఈ మండలమున పాలించి ప్రఖ్యాతి గాంచిన రాజవంశీయులు పెద్దాపురం నందున్న వత్సవాయివంశము వారు మరియు పిఠాపురం, మహారాజా 'రావు' వంశీయులు. ఈ వంశీయుల ప్రముఖ వ్యక్తుల దాతృత్వమీద గొన్ని గ్రామములు వెలసినవి. అలాగ వెలసిన గ్రామములకు ఆయా వంశీయుల పేర్ల మీదనున్నది.

వత్సవాయి బలభద్ర జగపతి పేరన
బలభద్రపురం- పెద్దా.
వత్సవాయి రాయజగపతి పేరన
రాయభూపాల పట్నం
భూపాలపట్నం
భూపతిపాలెం
వత్సవాయి చతుర్భుజ తిమ్మజగపతి పేరన
తిరుపతిరాజుపేట
తిమ్మరాజు చెరువు

అంతేగాక ఆ రాజుల పట్టమహిషిలు మహారాజుల నంతరము రాజ్యపరిపాలన చేసినారు.

వత్సవాయ రాజు జగపతి పట్టమహిషి
బుచ్చి సీతయ్యమ్మ పేరన సీతమ్మపేట

ద్వితీయభార్యలక్ష్మీనరసాంబ పేరన లక్ష్మీనరసాపురం

దైవసూచకాలు:

మతపరముగానే గాకుండా దైవములమీద అపార మైన భక్తి యున్నందువల్లన గూడా గ్రామనామములు వెలసినవి.

| శైవమతసూచకాలు | వైష్ణవమతసూకాలు |
|---|---|
| విశ్వేశ్వరాయపురం-రాజో-రామకృష్ణపురం | |
| శివకోడ | వెంకటకృష్ణరాయపురం |
| శంకర గుప్తం | కృష్ణపురం |
| సర్పవరం | జగన్నాథపురం |
| రామేశ్వరం | సీతానగరం |
| నాగవరము | కేశవరం |

సాధారణముగా ఒక ప్రాంతమున స్థిరపడిన ప్రజా సమూహమునకు జీవన పరిస్థితులు అనుకూలముగా నున్న ఎడల మరింతగా ప్రజాసమూహము ఆ ప్రాంత మున స్థిరనివాసముకొఱకు ప్రయత్నించును. ఆ ప్రయత్నములో ఆ గ్రామము విస్తరించుటగాని లేదా శివార్లలో మరి క్రొత్తగ్రామము వెలయుటగాని జరుగును. ఆ విధముగా నూతనముగా వెలసిన గ్రామమును వాడుకలో పిలుచుటకు దిక్కులపరముగా గాని లేదా పాత క్రొత్తలను పేర్లడి పిలవడము జరుగుచున్నది.

| | |
|---|---|
| పెద్దాపురం | ఎగువదారపల్లె |
| పాత పెద్దాపురం | దిగువదారపల్లె |

తూర్పులక్ష్మీపురం

సాధారణముగా ఒక ప్రాంతంలో నున్నటువంటి గ్రామనామము మరొక ప్రాంతములో గూడా అదే నామముతో మరొక గ్రామము కన్పిస్తూంటుంది. ఇది కేవలము అదే తాలూకాలోను లేదా అదే జిల్లాయందు ఉండవచ్చును. కేవలము ఒక్కటేకాదు. అనేకము లుండవచ్చును. లేదా చిన్నచిన్న మార్పులతో గూడా నుండవచ్చును. దీనిని స్థలనామ సమానరూపము లేదా సరూపనామాలు అందురు. దీనినే ఇంగ్లీషులో Duplication of place names యందురు, ఇట్టి సరూపనామములు గోదావరి మండలమున అనేకము కన్పిస్తాయి.

| | |
|---|---|
| భీమవరం | ఎల్ల ॥తా॥ కాకి ॥తా॥ |
| బలభద్రపురం-రామ ॥తా॥ | పెద్దా ॥తా॥ కాకి ॥తా॥ |
| సీతానగరము-రాజ ॥తా॥ | పెద్దా ॥తా॥ పిఠా ॥తా॥ |
| కేశవరం | ఎల్ల ॥తా॥ రాజ ॥తా॥ |
| కందులపాలెము-కాకి ॥తా॥ | రామ ॥తా॥ |

అధికారికంగా ఒక స్థలమునకు ఒకపేరున్నప్పుడు జన వ్యవహారంలో గాని, వాడుకలో గాని దానికి మరో పేరుగా వ్యవహరించబడుతుంది. కారణము అది కాలమున నుంచబడిన పేరు నవీనకాలము దాని అర్థములో అర్థచ్యుతి. అపహాస్యముగా కాని, కన్పించిన ఎడల, లేదా సాంఘిక, రాజకీయోద్యమాల ప్రభావము గాని అయి యుండవచ్చును.

ఉదాహరణకి రంపచోడవరం తాలూకా యందున్న లంజవాడ అన్న గ్రామమును గాంధీనగరము అని పిలుచుచున్నారు. ఆదికాలమున 'లంజ' ఉన్నతమైన అనే అర్థమును స్ఫురించినది. గాని నేడు అది అర్థచ్యుతి చెంది నిందాపూర్వకమైన పదముగా మారినందువలన నేడు రాజకీయోద్యమ ప్రభావముతో దానిని గాంధీనగరముగా పిలువబడుచున్నది.

అట్లాగే ఆలమూరు తాలూకా నందలి వేములపల్లెను సీతయ్యపాలెంగా జనవ్యవహారములో పిలువబడుచున్నది. ఇటువంటి వ్యవహారము నాడు గ్రామనామ వ్యవహారమున మాత్రమే గాక, నేడు వ్యక్తినామములలో గూడా పిలువబడుచున్నారు.

# తొలి అర్ధశాస్త్రంలో స్త్రీ సంక్షేమం

— పాలకోడేటి జగన్నాథరావు

భారతదేశంలో తొలి అర్థశాస్త్రం పుట్టి యిప్పటికి 2300 సంవత్సరాలు అయింది. హిందూదేశచరిత్రలో చాణక్యుడుగా ప్రసిద్ధి పొందిన కౌటిల్యుడే తొలి అర్థ శాస్త్ర రచయిత. ప్రాచీన కాలపు భరతఖండం లోని పరిపాలనా విధానాలను సమగ్రంగా వివరించే గ్రంథ మిదే. అంతేకాదు. ప్రాచీనకాలపు భారతదేశ సాంఘిక పరిస్థితుల నర్థం చేసికొనుటకు దీనికంటె ఉత్తమమైన గ్రంథమింకొకటి లేదని చెప్పవచ్చు. కారణం నీతి సారాన్ని వ్రాసిన కామందకుడు; నీతి కావ్యామృతాన్ని వ్రాసిన సోమదేవుడు; నీతి ప్రకాశికను వ్రాసిన వైశం పాయనుడు. ఇలా ఎంతోమంది నీతి; రాజనీతి గ్రంథాలను వ్రాసినా అవి కౌటిల్యుని అర్థశాస్త్రం వలె అంత సమగ్రమైనవి కాకపోవటమే. అంతేకాక కామంద.కాదులవలె కౌటిల్యుడు కేవలం పండితుడు మాత్రమేగాక నందవంశ నిర్మూలనం గావించి చంద్ర గుప్తుణ్ణి మగధ రాజ్యసింహాసనాన్ని ఎక్కించి భారత దేశ చక్రవర్తిని చేసి మహామంత్రియై సర్వరాజ్య తంత్రాన్ని నడిపిన రాజనీతి దురంధరుడు కూడ కావటంచేత అతడు వ్రాసిన గ్రంథానికే తొలి అర్థ శాస్త్ర గౌరవం లభించింది. మనకీనాడు భారత రాజ్యాంగ గ్రంధమెట్లో అలాగే ఆనాడు కూడ ఈ అర్థ శాస్త్రం రాజ్యాంగ గ్రంథమే. ఈ గ్రంథం పుట్టి యిప్పటికి 2300 సంవత్సరాలు గతించినా ఆ గ్రంథ ములో చాణక్యుడు చెప్పిన నీతినియమాలు, ఆజ్ఞాలు. ఆదేశాలు ఆశయాలు ఇప్పటికి కూడ వన్నె తరగ లేదంటే ఆ గ్రంథ ప్రామాణికత ఎట్టిదో మన మూహించుకోవచ్చు.

బిడ్డల యోగక్షేమాల విషయంలో తండ్రి ఎంత బాధ్యుడో ప్రజలకు తండ్రి వంటివాడైన రాజు (ప్రభు త్వము) కూడ అంతే బాధ్యుడు. ఈ దృష్టితో చాణ క్యుడు ప్రభుత్వం నిర్వహించవలసిన సంక్షేమ కార్య క్రమాలనెన్నింటినో అర్థశాస్త్రంలో వివరించాడు. అందులో స్త్రీ సంక్షేమమెంతో ముఖ్యమైనది. ఈ విష యంలో కౌటిల్యుడు చూపిన శ్రద్ధ-యిచ్చిన ప్రాము ఖ్యత; నిర్ద్వంద్వంగా చెప్పిన విధినిషేధాలు, విధించిన శిక్షలు. స్త్రీ సంక్షేమమే ధ్యేయంగా పెట్టుకొన్న ఆధు నిక నాగరిక ప్రభుత్వాలు కూడ అంత నిర్ద్వంద్వంగా చెప్పి ఆచరణలో పెట్టలేదని అంగీకరించడానికి సిగ్గు పడనక్కర్లేదు.

కామాంధులకు కాలమైన యీ కలికాలంలో స్త్రీలకు తమ మాన సంరక్షణ విషయంలోనే ఆనాడు కూడ సంకట పరిస్థితే ఉండేది. అయితే చాణక్యుడీవిషయ ములో చాల కఠినంగా వ్యవహరించాడు. "కుల స్త్రీలను బలాత్కరించేన వానికి మరణ దండన. (2అధికరణం 36 అధ్యాయం, 56 ప్రకరణం, 41 సూత్రం) విధించి స్త్రీలకు చట్టపరంగా గట్టిగ రక్షణ కల్గించాడు.

మరణశిక్షలను విధించటాన్ని బట్టి- కౌటిల్యుడు మానవతా దృష్టి లేనివాడిగా భావించనవసరం లేదు. నేరస్థుణ్ణి శిక్షించటం కంటె సంస్కరించటమే ముఖ్య మనే న్యాయసూత్రం కౌటిల్యుడికి తెలియపోలేదు. పోని ఆ మానవతా న్యాయదృష్టితో వ్యవహరిస్తున్న యీ కాలంలో పూర్వంకంటె ప్రజలలో నేర ప్రవృత్తి తగ్గిందా? నేరాలు తగ్గాయా? కాకపోగా అన్యాయ

సూత్రం అలుసుగా తీసుకొని నేరప్రవృత్తి యింకా పెరిగిపోయింది. నేరస్థుణ్ణి సంస్కరించడమనే పేరుతో ఇంకో పదిమందిని నేరస్థులుగా తయారయ్యేటట్టు చేయటం కంటె కఠినంగా శిక్షించడమే మంచిదని భావించేతత్వం కౌటిల్యునిది. అందుచేతనే స్త్రీలపై అత్యాచారాలను చేసే వారికి కఠినంగా మరణశిక్ష లనే విధించాడు.

## న్యాయస్థానాలు - న్యాయం

ఏ దేశంలోనైనా ఏమోగాని మన భారతదేశంలో మాత్రం ఏకుల స్త్రీ కూడా తనకు మానభంగం జరిగితే న్యాయస్థానాలకు వెళ్ళదు. తిన్నగా నుయ్యోగొయ్యో చూచుకొంటుంది. అంతే. పోని తెగించి ఎవతైనా న్యాయస్థానాలకు వెళ్ళిందా న్యాయవాదుల కొంటె ప్రశ్నలకు మరోసారి మాన (గౌరవ) భంగమే స్త్రీకి ఎదురౌతుంది. ఇప్పుడందరకు అనుభవసిద్ధమేకదా. స్త్రీకి కలిగేయీసంకట పరిస్థితిని గమనించిన చాణక్యుడు.

స్త్రీలు ఏ విషయంలో కూడా న్యాయస్థానానికి రానవసరం లేదు. ధర్మస్థులు (న్యాయాధిపతులు) స్వయంగా వీరికి కార్యములను చక్కపెట్టవలెను. (3 అధి. 20 అ. 75 ప్ర. 22 సూ,) అని స్త్రీలకు అది గొప్పరాయితీ నిచ్చాడు.

కౌటిల్యుని దృష్టియింతటితో ఆగలేదు. చాలా దూరం ప్రసరించింది. స్త్రీకి అన్యాయం ఏదేశంలో జరిగినా, జరిగి ఎంతకాలం గడిచి పోయినా కూడ వాటిని పరిగణనలోనికి తీసికొని వారి వ్యవహారములకు కొట్టివేయ రాదని 3 అధి 20 అ 75 ప్ర 22 సూ, స్త్రీలకు అసాధారణమైన గట్టి రాయితీలను న్యాయ సూత్ర పరంగా కల్పించి కౌటిల్యుడు స్త్రీలకేంతో అండగా నిలిచాడు.

## స్త్రీ నేరస్థులకు రాయితీ

నేరస్థులనుండి నిజాన్ని రాబట్టడానికి రాజభటులు వారిని కొంత హింసించే పద్ధతి ఆనాడు తూడా ఉంది దీన్ని కౌటిల్యుడు కర్మ వ్యవహారమంటారు. అయితే నేరం చేసిన స్త్రీల విషయంలో కూడ కౌటిల్యుడు కొంత మృదువుగానే వ్యవహరించాడు.

అపరాధం చేసిన స్త్రీల విషయంలో అర్ధ కర్మ వ్యవహారమును మాత్రమే ప్రయోగించాలి. వేద వాక్యానుపయోగం వల్ల అంటె ప్రశ్నల ద్వారా మాత్రమే వారిని పరీక్షించా అని 4 అధి 8 అ 83 ప్ర 17 సూ లో రాజభటులకు హెచ్చరించాడు.

## బాల్యవివాహాల నిషేధం

భారతదేశం బాల్య వివాహాలకు పెట్టింది. పేరు అయితే యిది అర్థశాస్త్రకాలంనాడు మాత్రం లేదు. ఇది మధ్యకాలంలో వచ్చి ఒక దురాచారం మాత్రమే భారత ప్రభుత్వం స్త్రీ పురుషుల వివాహ వయస్సునే విధంగా నిర్ణయించిందో ఆలాగే కౌటిల్యుడు కూడ వివాహ వయస్సును పురుషులకు 16 గాను స్త్రీలకు 12 గాను (3 అధి 3 అ 59 ప్ర 1 సూ.) నిర్ణయించి బాల్యవివాహాలను నిషేధించాడు. కాని కౌటిల్యుని కాంత దృష్టి అంతటితో నిలువలేదు. ఆధునిక స్త్రీ సమాజం కూడ తమకు జరుగుతున్న గుర్తించని అన్యాయాన్ని కూడ కౌటిల్యుడు 2300 సంవత్సరాలకుముందే గుర్తించాడు.

మగవాడైతే చాలు తనలో నపుంసకత్వము - సుఖరోగపీడిత - బలహీనత - గుప్తరోగములు ఇలా ఎన్ని ఉన్నా కప్పిపుచ్చుకొని స్త్రీని వివాహమాడి ఆమెను అవస్థలపాలు చేస్తున్నాడు. ఈ విధంగా స్త్రీ సమాజానికి కల్గుతున్న అన్యాయానికి కౌటిల్యుని రసార్ద్ర హృదయం చలించి పోయింది. అందుకనే యీ విధమైన తనలోని దోషాలను చెప్పక వివాహమందు వానికి రెండింతల దండము (Double punish-

ment) విధించాడు. అంతేకాదు, ఆనాటి కన్యాశుల్కాచార ప్రకారంగా తానిచ్చిన శుల్కాన్ని వదులుకొని ఆమెనుకూడా వదులుకోవాలని (3 అధి 15 అ 67 ప్ర 15 సూ) కఠినంగా శాసించాడు. స్త్రీ సంక్షేమాన్ని కోరే ఏ దేశంలోనైనా యిలాంటి నిబంధన ఉందా మరి?

## స్త్రీ పునర్వివాహం

భార్య చనిపోతే పురుషుడు పునర్వివాహ మాడ వచ్చును గాని స్త్రీ ఏల పునర్వివాహ మాడరాదు? అని నేటి స్త్రీ సమాజం ప్రశ్నిస్తున్నది. కాని స్త్రీ పునర్వివాహమాడరాదని ఎవరు చెప్పారంటూ, కౌటిల్యుడు వీరికి 2300 సం॥ పూర్వమే సమాధానం చెప్పాడు.

ధర్మయుక్తంగా వివాహమై భర్తృ సంపర్కం లేనప్పుడు కారణాలేమైనా భర్తలు కామ భార్యలను విడిచి వెళ్ళిపోయినపుడు వారి రాకకోసం కొంతకాలం వేచిచూచి వారురానిచో పునర్వివాహం చేసికోవచ్చునని (3 అధి 4అ 59ప్ర 31సూ) అభయమిచ్చాడు. అయితే యిక్కడొక సందేహం రావచ్చు. భర్తృ సంగమం లేని స్త్రీలకే పునర్వివాహయోగ్యత ఇచ్చాడు గాని సంతానవంతులైన స్త్రీల విషయంలో కౌటిల్యుడు కఠినంగా వ్యవహరించాడా అని కాని అలా భావించ రాదు. అదే ప్రకరణంలో 24వ సూత్రంలో దేశద్రిమ్మరులైన తమ భర్తలకోసం స్త్రీలను కోరినంతకాలం వేచియుండి వారు రానిచో పునర్వివాహము చేసికో వచ్చునని కూడ అనుమతించాడు. దీన్ని బట్టి కౌటిల్యుడు స్త్రీ పునర్వివాహాన్ని ఎంతో బలపరచినట్టు కనబడుతుంది.

## వివాహాలరద్దు

వివాహవిషయంలో స్త్రీలకెదురయ్యే మరొక సంకట పరిస్థితిని కూడ కౌటిల్యుడు గుర్తించాడు. వివాహానికి పూర్తిగా నిశ్చయమైపోయిన తరువాత ఆ వివాహాన్ని రద్దు చేసికొనడానికి స్త్రీ సమాజం భయపడుతుంది. ఏ స్త్రీ విషయంలోనైనా అలా జరిగితే ఆ స్త్రీలోనే లోపముందని లోకం భావించి వివాహం కాదు. స్త్రీల కెదురయ్యే యీ దుస్థితిని సమాజపరంగా కాకపోయినా చట్టపరంగా మాత్రం కౌటిల్యుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల విషయంలో పెండ్లికి ముందు శూద్రస్త్రీలవిషయంలో వివాహం జరిగినా పునస్సంధానం జరుగని పక్షంలో వివాహాన్ని రద్దు చేసుకోవచ్చు (3 అధి 15అ 67 ప్ర 11 సూ) అని రక్షణ కల్పించాడు.

## విడాకులు

భర్త సజ్జనుడైనా దుర్జనుడైనా స్త్రీ మాత్రం అతనితో కష్ట సుఖాలననుభవింప వలసినదేయని ధర్మ శాస్త్రాలు స్త్రీలకు నియమాలు విధించినా కౌటిల్యుడు మాత్రం అలా చెప్పలేదు. భర్త నీచుడైన- పరదేశములకు పారిపోయినా, రాజద్రోహి అయినా, తన ప్రాణములకు ముప్పుతెచ్చే వాడయినా, పతితుడైనా నపుంసకుడైనా అట్టి వానిని స్త్రీ వదిలవేయవచ్చునని 3 అధి 2 అ 59 ప్ర 48 సూ. లో పతివ్రతాధర్మానికి భగతవాక్యం పలికి స్త్రీ సంక్షేమానికి నాందిపలికాడు కౌటిల్యుడు.

## ఆస్తిలో హక్కు

తండ్రి ఆస్తిలో స్త్రీలకు ప్రత్యేకమైన హక్కును ఈయక పోయినా ఆస్తి పంపకం జరిగేటప్పుడు పెండ్లికాని ఆడ పిల్లలకు కూడ కొడుకులతోబాటు సమాన వాటా పంచిపెట్టాలని (3 అధి 5 అ 60 ప్ర 21 సూ.) ఆదేశించడం ద్వారా పెండ్లికోసం అన్నదమ్ముల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడుతూ నిత్యం అవమానాలకు గురియౌతు గ్రుడ్డ నీరుగుక్కు కొనుచున్న ఆడపడచుల కడగండ్లను తుడిచివేసినాడు కౌటిల్యుడు.

## స్త్రీధనం

ఆస్తిలో హక్కును స్త్రీకివ్వక పోయినా స్త్రీని తన దంటు కొంతధనముండాలని గుర్తించి శాశ్వత ప్రాతి

పదిక మీద అర్థ శాస్త్రంలో నిర్దేశించాడు. అది భర ణము- అభరణము అని రెండు విధాలు. రెండు వేల పణములకు మించని స్త్రీలకిచ్చుదానము భరణము. ఈ పరిమితితో సంబంధం లేకుండ బంగారు ఆభర ణములెన్నైనా ఆభరణములనే ధనము (3 అధి 2 అ 59 ప్ర 14&15 సూ) ఇలా స్త్రీ ధనాన్ని కల్పించ టమే దానికి గట్టిచట్టరీత్యా రక్షణ కూడా కల్పించాడు వ్యక్తి మరణించినపుడు అతని ఆస్తిని పంచుకునే దాయాదులులేనప్పుడు ప్రభుత్వమే అతని ఆస్తిని స్వాధీన పరచుకోవాలని 3 అధి 5 అ 60 ప్ర 28 సూ లో నిర్దేశించినా అతని భార్యకుండే స్త్రీ ధనాన్ని మాత్రం వశపరచుకోరాదని హెచ్చరించి స్త్రీ ధనానికి రక్షణ కల్పించాడు. కౌటిల్యుడు అంతేకాదు. భార్య అనుమతి లేకుండ ఋణాలు చేసిన భర్త మరణిస్తే భర్త ఋణాలతో భార్యకెట్టి సంబంధం లేదని 3 అధి 11 అ 63 ప్ర 23 సూ లో నిర్దేశించి స్త్రీ ధనానికి ప్రభుత్వంనుండే కాక భర్తఋణాలనుండి విముక్తి కల్గించాడు.

## స్త్రీలకు ఉద్యోగాలు

ఆనాడు స్త్రీ పురుషునితో బాటు ఉద్యోగం చేయ వలసిన అవసరం అంతగా లేక పోవటం వల్ల కౌటి ల్యుడు స్త్రీలకు ఉద్యోగహక్కును ప్రతిపాదించక పోయినా కొన్ని కొన్ని పరిస్థితులలో స్త్రీలకు ఉద్యోగం చేయవలసిన పరిస్థితులేర్పడవచ్చునని మాత్రం గుర్తించి కౌటిల్యుడు ఆనాడే కొన్ని ఉద్యోగాల్లో స్త్రీ లకు రిజర్వేషన్లను కల్పించాడు. చెట్టపట్టలు- ఉన్ని నారలు- ప్రత్తి- బూరుగదూది శణము కౌమము నుండి నూలు తీసే పనులలో మాత్రం స్త్రీలనే అంటే విధవలు, అంగవికలలగు స్త్రీలు, పరివ్రాజితలు, దండ ప్రతీ కారిణులు వేశ్యమాతలు, రాజదాసజనముల లోని వృద్ధురాండ్రు సేవచేయలేని దేవదాసీజనులు వీరిని మాత్రమే నియమించుకోవాలని (2 అధి 23 అ 40 ప్ర 2 సూ లో నిర్దేశించాడు. అంతేకాక జీవనో పాధిలేక గడపదాటి బయటకు రాలేని స్త్రీలమీద కూడ కౌటిల్యుని కరుణ ప్రసరించింది. పనులనుచేయుటకై బయటకువచ్చుటకు సిగ్గుపడే స్త్రీలను- విధవలను, అంగ వికలలగుస్త్రీలను, కన్యలను, సూత్రాధ్యక్షుడు తప్పక పనులలో నియమించుకోవలెననియు దాస దాసీ లను వారి యిండ్లకు పంపి వారికి జీవనోపాధిని కల్పించవలెననియు 2 అధి 23 అ 40 ప్ర 11 సూ లో ఆదేశించాడు. ఇంతటితో తన బాధ్యత తీరిపోయిం దని అనుకోలేదు.

## -ఉద్యోగినులకు రక్షణ

ఉద్యోగం చేస్తున్న స్త్రీలతో పురుషులు అన్యవిష యములను గూర్చి మాటలాడినా చివరకు వారి ముఖా లవంక పరిశీలనగా చూచినా 48 నుండి 96 పణముల వరకు జరిమానా (పూర్వసాహసదండము) విధించా లని 2 అధి 13 అ 40 ప్ర 14సూ నిర్దేశించి ఎంతో రక్షణ కల్పించాడు కౌటిల్యుడు.

## సామాన్య స్త్రీలకు రక్షణ

ఈ నియమములు కేవలం ఉద్యోగినులకే పరి మితం చేయలేదు. ఏ స్త్రీనైనా సరే పరుషంగా మాట లాడినా అవమాన పరిచినా తెండింతల దండాన్ని అంటే 72 పణముల జరిమానా విధించాలని 3 అధి 18 అ 72 ప్ర 5 సూ లో కఠినంగా శాసించాడు. అన్యస్త్రీ విషయంలోనే కాదు చివరకు భార్యనైనా నోటికి వచ్చినట్లు నిందావాక్యాలు పల్కి అవమానించ రాదు, అలాచేసిన భర్తకు వాగ్దండ పారుష్య దండ

ములలో సగం దండంగా విధించాలని 3 అధి. 3అ 59 ప్ర. 7 సూ. నోటిదురుసుగల భర్తల నోళ్ళకు తాళం వేసాడు కౌటిల్యుడు.

**అనాథస్త్రీల రక్షణ**

సమాజంలో నిత్యం సూటి పోటిమాటలతో అవమానింపబడుతు చివరకు చచ్చేటప్పుడు గొంతుకో గ్రుక్కెడు తులసి తీర్థంకూడ పోయడానికి సంతానం లేని నిరాధారులైన గొడ్రాళ్ళు- కారణాంతరాలవల్ల నిరాహారులై పోయినస్త్రీలను మరియు వారి సంతానముకూడా ప్రభుత్వమే పోషించి రక్షించాలని 2 అధి 1 అ. 19 ప్ర. 26 సూ. లో అపూర్వ స్త్రీ సంక్షేమ కార్యక్రమాలను చేపట్టాడు కౌటిల్యుడు.

ఇలా ఎన్నో స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు 2300 సం॥ ముందే ఆరంభించి వానినమలు జరిపిన కౌటిల్యుడు చిరస్మరణీయుడు కావటమే కాదు నేటికి మనకు ఆదర్శప్రాయుడై నాడనుట నిస్సందేహము.

—పాలకోడేటి జగన్నాథరావు. పెనుకొండ



## స్వర్ణ జయంతి హిందీ పరిచయ ప

### ఆరవ పర్యాయం జరగనున్న పరీక్షా వివరం

హిందీప్రచారకుల కోర్కెననుసరించి రాబోవు 1984 డిశంబరు నెలలో కూడ స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్ష నడుపుటకు నిర్ణయించడమైనది. కార్యక్రమం ఈ దిగువ నివ్వబడినది.

1 పరీక్షార్థుల పట్టిక, పరీక్షా రుసుము
అంగీకరించు చివరితేదీ — ది. 1 12-1984

2. హిందీపరిచయ పరీక్ష జరుగు తేదీ — ది 16-12-1984

పరీక్షారుసుం శ్రీకార్యదర్శి, స్వర్ణోత్సవసమితి, దక్షిణభారత హిందీప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాద్-4 అని వ్రాసి పంపకోరుచున్నాము.

హైదరాబాద్
ది. 29-9-1984

గోదా తిరుమలయ్య
కార్యదర్శి
స్వర్ణోత్సవ సమితి

# సాహిత్యగోష్ఠి

## తెలుగు నాటక రంగానికి అచలం కోలాచలం

ఆంధ్ర నాటక కర్తలలో, అత్యుత్తమ శ్రేణికి చెందిన వారు స్వర్గీయ కోలాచలం శ్రీనివాస రావుగారు. ఎక్కువగా చారిత్రక నాటకాలు రచించి "ఆంధ్ర చారిత్రక నాటిక పితామహుడు" అన్న ప్రతీతికి పాత్రుడై "సుమనోరమ సభా" నాటక సమాజమునకు అధ్యక్షుడుగా వ్యవహరించి, "వాణీ విలాసనాటకశాల"ను తొలిసారిగా బళ్ళారిలో నిర్మించి ఇతరుల కసాధ్యమైన "ప్రపంచ నాటక చరిత్ర అనే ఉద్గ్రంథాన్ని ఆంగ్ల భాషలో రచించి ఆంధ్ర నాటక వాఙ్మయానికి, ఆంధ్ర నాటక రంగానికి ఎనలేని సేవచేసిన మహామనిషి కోలాచలం శ్రీనివాసరావు గారు. ఈయన వ్యాఖ్యాత శిరోమణిగా ప్రసిద్ధి గాంచిన మల్లినాథ సూరి వంశీయులని ప్రతీతి.

వీరు రచించిన "రామరాజు చరిత్రము" అను నాటకము విశేష ప్రచారము నొందినది. దీనిని ఆంధ్ర దేశమంతటా ప్రదర్శించి ప్రచారానికి తెచ్చినవారు బళ్ళారి రాఘవాచార్యులుగారు ఇంకా వీరినాటకాల్లో సునందినీ పరిణయము అనేది గుంటూరు హిందూ థియేటర్‌వారు, బందరు నేషనల్ థియేటర్ వారు ప్రదర్శించే వారు. కొన్నాళ్ళు గడిచాక వీరి రామరాజు నాటకంపై ప్రభుత్వం ఆంక్షవిధించింది. ఈయన నాటక రచనలో గ్రామ్య భాషను అంగీకరించెడి వారుకారు. విషాదాంత నాటకాలపట్ల ఆసక్తి లేక కేవలం సుఖాంత నాటకాలే వ్రాయడం పట్ల శ్రద్ధ కనపరిచారు.

శ్రీనివాసరావు గారు ధర్మవరం వారికి సమకాలికులు. బళ్ళారిలో పేరు పొందిన వకీలు ముఖ్యంగా వీరి రామరాజు చరిత్ర నాటకంలో ఇతివృత్తం విజయనగర రాజ్య పతనం. దీనిలో పఠాన్ పాత్ర చాలా ప్రాముఖ్యత కలది ఆ నాటకమే కాకుండా పాదుకా పట్టాభిషేకము, లంకాదహనము; కాళిదాస, మానావమానము, రుక్మాంగద, మదాలసా పరిణయము; సుఖమంజరీ పరిణయము, చాందుబీబీ, ప్రతాపాక్బరీయము మైసూరు రాజ్యము, కుశలవ, శ్రీరామ జననము, ద్రోపదీవస్త్రాపహరణము, కీచకవధ, బభ్రువాహననాటకము, హరిశ్చంద్రచంద్రహాస' శిలాదిత్య, ప్రహ్లాదాదిగాగల అనేక పౌరాణిక, సాంఘిక, చారిత్రక నాటకాల నెన్నిటినో వ్రాసియున్నారు.

కోలాచలం వారు వ్రాసిన మొత్తము నాటకములు ముప్పదన్నట్లు డాక్టర్ గంగప్ప గారు పేర్కొన్నారు. శ్రీనివాసరావు స్వతంత్ర నాటక కర్త. సమాజపు నటులను దృష్టిలో పెట్టుకుని నాటక రచన చేసే వారని చెప్తారు. పద్యములను పాటలను కూడ ఉచితమైన చోట్ల రచన చేయడం జరిగింది. కాని వీరి నాటకాలలోపాటలు రచించుట కంటె పద్యములు రచించుటయన్న ఎక్కువయిష్టమని ఆయననాటకాలుఋజువు చేస్తాయి సంగీత జ్ఞానముతోబాటు బహుభాషాకోవిదుడగుట వలన ఆయన అన్ని విధాల యోగ్యమైన, నాలుగు కాలాల పాటు మన్న గల నాటకాలను రచించ గలిగారు. ప్రతిభతో బాటు కళాసేవ చేయాలనే తపన కూడా ఆయనను నాటక కర్తచేసి ఉన్నత ప్రమాణాలు గల నాటకాలను వ్రాయించినదని చెప్పుకోవచ్చును.

అనంతపురంలో దివాన్‌గా జీవితాన్ని ప్రారంభించి, న్యాయవాదిగా స్థిరపడి బళ్ళారిలోనే ఆయన కీర్తి ప్రతిష్ఠలతో బాటు ధనాన్ని, సంపాదించుకున్నారు. వీరి అన్నగారైన వెంకట్రావు గారి పుణ్యమా యని వృత్తిలోను, సంఘ సంస్కరణ విషయాలోను, సాంస్కృతికాది రంగాలలోనూ అభిరుచి ఏర్పడ్డం జరిగింది. తన స్వశక్తిచే తెలుగులోనే కాకుండా ఇంగ్లీషు, కన్నడ, మరాఠీ, సంస్కృతాది భాషల్లో అపార పాండిత్యాన్ని సంపాదించుకోగలిగారు.

ఆయనలో తన రచనలనన్నింటినీ ముద్రింపించిశాశ్వతం

చేయాలనే తపన ఎక్కువగా ఉండేది. అందుకే కాబోలు ప్రథమ ద్వితీయ దశలుగా నాటకాలు ఇతర రచనలు ముద్రింపించాలని మద్రాసుకు పోవాలని నిర్ణయించుకున్నారట. అనారోగ్యం ఎక్కువ కావడంచేత శ్రీనివాసరావు గారు తన ఆశయం నెరవేరకుండానే స్వర్గస్థులయ్యారు. అయితే అనంతర కాలంలో వారి పెదకుమారుడు శత్రుఘ్నరావు గారు తండ్రి రచనలన్నింటిని వెలుగులోనికి తెచ్చి తండ్రి ఆశయాన్ని నెరవేర్చిన ఘనత దక్కించుకో గలగడమేగాక తండ్రి ఋణం తీర్చుకో గలిగారని అనుకోవచ్చును. కోలాచలం శ్రీనివాసరావు గారు ధర్మవరం వారు చనిపోయిన ఏడేండ్లకు కన్నుమూసారు.

యదార్థాన్ని దాయకుండా చెప్పాలంటే కోలాచలం శ్రీనివాసరావు గారిలో నాటక రచనాపరమైన విశిష్టగుణగణాలు ఎన్నో అవుపిస్తాయి. ఇతి వృత్త నిర్మాణ దక్షత, సన్నివేశకల్పనా సామర్థ్యం, పాత్ర చిత్రణ, నాటకీయ శిల్పం, నీతిబోధ చక్కగా పోషించారు. రచనా ప్రయోజనం, రచనాశిల్పం, హాస్యరసపోషణా విధానం, విషాదాంత నాటక రచనాసరళి-అనంతరకాలంలో నాటక రచయితలకు ఎంతగానో ఉపయోగ పడ్డాయని నిరభ్యంతరంగా చెప్పుకోవచ్చు

వ్యక్తిగతంగా చెప్పాలంటే శ్రీనివాసరావు గారు గంభీర స్వభావులు. అందుకే కాబోలు రచనల్లో మచ్చుకైనా చౌకబారు హాస్యం కనిపించదు. చమత్కారం మాత్రం ప్రతి నాటకంలో గోచరిస్తుంది' ఆయన నాటకాలలో ఔచితీ భంగం ఎక్కడా కనిపించదు. అనౌచిత్యాన్ని పరిహరించి ఔచితీ స్ఫోరకంగా నాటక రచన చేయడమే శ్రీనివాసరావు గారిలో గల విశిష్టగుణము. ఇన్ని మేటిగుణగణాలు కలిగిన కోలాచలం శ్రీనివాసరావు గారు ఇటు తెలుగు నాటక రంగానికి అటు సాహితీ రంగానికి చేసినసేవ గణనీయమైనదీ, అపారమైనదీ, అనన్యసామాన్యమైనదీ అనితరసాధ్యమైనదీ అంటే అతిశయోక్తి కాదేమో!

**యమ్. సూర్యనారాయణ రాజు**
యమ్. ఏ. (లిట్) బి. వో. యల్
లెక్చరర్ ఇన్ తెలుగు
యస్. కె. బి. ఆర్. కాలేజీ
అమలాపురం 533 208 ఈ జి డి

# ఆధునికాంధ్ర సాహితీ క్షేత్రంలో తెరమరుగునపడిన ధ్రువతార 'మోటూరి వేంకటరావు'

ఆంధ్ర ప్రదేశ్‌లో విజయనగరం ప్రసిద్ధిచెందింది, కళలకు కణాచి. సాహిత్యక్షేత్రంగా ప్రసిద్ధిచెందినది. విజయనగరం జిల్లాలోని బొబ్బిలి చరిత్ర ప్రసిద్ధమైనది విజయనగరం కవులకు పండితులకు పుట్టినిల్లు.

' విజయనగరంలో మోటూరి గంగాంబ నారాయణలకు వేంకటరావు గారు జన్మించిరి. వేంకటరావు గారి విద్యాభ్యాసమంతయు విజయనగరములోనే గడచినది. ఉద్యోగరీత్యా తండ్రిగారి వెంట తిరిగిననూ, కళాశాలలో బి ఏ, వరకు చదివి ఎక్సైజు శాఖలో ఉన్నతోద్యోగిగా పనిచేసిరి. వేంకటరావు'గారు సుకుమార మనస్వి. బాల్యము నుండి కవిత చెప్పుట నేర్చిరి వీరి తండ్రిగారు వీరికి కవితాగురువు.

వీరి జననము 17-2-1911-మరణము-?-6-1982 ఉద్యోగము చేసిన కాలము 31 సంవత్సరములు.

వీరి రచనలు :-

| | |
|---|---|
| 1. మృగ తృష్ణ | ఖండికల సంపుటి |
| 2. హిమగళము | కావ్య ఖండికల సంపుటి |
| 3. సింహబలి | వీరరసప్రధానమగుకావ్యము |
| 4. చకోర సందేశము | సందేశ కావ్యము |
| 5. పద్మినీ భాస్కరము | అపూర్వ సృష్టి |
| 6. తిలోత్తమ | లఘు కావ్యము |
| 7. కర్ణ కథార్ణవము మొదటిభాగము | కర్ణుని జీవిత గాథ |

ఈ ఏడు రచనలు ప్రచురణ పొంది సాహితీ జిజ్ఞాసువుల మన్నన లొంది విశ్వనాథాది ప్రభృతుల ప్రశంసల నొందినవి.

ప్రచురణకు నోచుకొని రచనలు

1. మణిమాల — ఏడు కావ్యఖండికల సంపుటి
2. కర్ణకథార్ణవము-కర్ణుని జీవితగాథ. రెండవ భాగము

| | |
|---|---|
| The Piccalo of pastrol Poetry | - గ్రామీణుల జీవనవిధానముతో ఆంగ్లమున వ్రాయబడిన ఖండికలు |
| 4. నరమేధము | - గేయ నవల |
| 5. శ్రీ కూర్మ శతకము | - వేంకటరావుగారి అవసాన కాలమున వ్రాయబడిన అసంపూర్తి శతకరచన. |

తెలుగు సాహితీ నందనోద్యాన వనంలో మధుర పరిమళాలు వెదజల్లి బంగారు పంటలు పండించిన కీ. శే. విశ్వనాథ సత్యనారాయణ, మధునాపంతుల, వెంపరాల, తుమ్మల, కరుణశ్రీ మొదలగు కవులు: విశ్వవిద్యాలయములలో తెలుగుశాఖలో ఆచార్యపీఠమలంకరించిన డా కె. వి. ఆర్. నరసింహం, యశస్వి యస్వీ తూమాటిదోణమ్మ తుమ్మపూడి కోటేశ్వరరావు, గంధం అప్పారావు, ఇత్యాది ప్రభృతులు వేంకటరావుగారి ప్రౌఢకవితా పరిమళాలను చవిజూచి, బహువిధాలుగా ప్రశంసించిరి. వీరి కవిత్వము ప్రౌఢము. భావనలు లలిత సుకుమారములు.

ఇంతటి గొప్పకవిత్వమును వెలయించి, గొప్పవారిచే ప్రశంసలు పొందియు, వీరుగాని వీరిరచనలుగాని తెలుగు సాహితీ క్షేత్రానికి గాని, ఆంధ్ర పాఠక లోకానికి గాని అంతగా తెలియవు. కారణమేమో. ఎంత అన్వేషించిననూ, ఊహకందుట లేదు. కవి పండిత వంశములో జన్మించి,కవి పండితులుగ రూపొందిననేగాని ప్రథిత యశస్కులగుట సహజము. కాని వేంకటరావుగారి విషయమందుకు భిన్నము వీరి తండ్రిగారు పోలీసోద్యోగి. వీరు చేపట్టిన వృత్తి ఎక్సైజు శాఖలో ఉన్నతోద్యోగము. వీరు పరిశ్రమించెడిది కవితా రచన. ఇవన్నియు ఒకదానికొకటి పొందిపొసగునవి గావు. అయినను ఏటి కెదిరీదినట్లు చేపట్టిన పనిని సమర్థవంతముగ నిర్వహించిరి ఎక్సైజు శాఖతో ఉద్యోగించిన ఏ ఉద్యోగియు ఆర్థికముగ బాధపడుట జరుగదు. నెలనెలా లభించెడి వేతనమున కిబ్బడిముబ్బడిగ మామూళ్ళందుచు సుఖజీవనము చేయువారే వేంకటరావు గారు కవి గావున సుకుమార మనస్వి. తను నమ్మిన సత్యమునకెచ్చటా భంగపాటు కలుగనీయని భంగిమలో అక్రమార్జనకు పూనుకొనక ఉద్యోగము చేయుకాలములోనూ, రిటైరైన పిదప అనేక ఆర్థిక క్లేశములకు లోనయిరి. ఇది జీవిత విషయము.

కవితా విషయమున, మనకున్న సూక్తి– కవితా వనితా లతా - ఆసరాలేనిదే ముందుకు సాగలేవు. అభ్యుదయము గాంచలేవు. వేంకటరావుగారు ఉత్తమమయిన ప్రౌఢమగు కవిత్వమును వెలయించిరే గాని, వాటి బహుళ ప్రచారము కొరకు ప్రాకులాడలేదు ఎట్టకేలకు వాటిని ప్రచురించుకొనుట వరకే యత్నించి కొంత వరకు సఫలీకృతులైరి.

ప్రచురణ పొందిన వీరి రచనలు – దేనినీ, ఏ విమర్శకుడుగాని, కవిగాని, పండితుడుగాని – ఆ రచనను గూర్చి సత్తాలేదని గాని, పనికి రావనిగాని, నీరస కావ్యమని గాని పలుకలేదు. అట్టిచో వీరిరచనలేల బహుళప్రజాదరణ పొందలేదు? ఎందుకు సాహిత్య ప్రచారము జరుగలేదనునది ప్రధానమగు అంశము.

ఒకరి ఆశ్రయము పొందుట ఇష్టము లేని వీరు ఎవరి సహాయ సహకారములు అర్థించియుండరు. ఈ విషయమెటుల స్పష్టపరుపగలము అనినపుడు వీరి ఉద్యోగ జీవితమును పరిశీలించిన, వీరు ఒక ప్రదేశమున నిలుకడగ యుండక అనేక ప్రాంతములకు బదిలీలు చేయబడి అనేక ప్రాంతములలో ఉద్యోగించిరి. శ్రీకాకుళం జిల్లా నుంచి నంద్యాలకు, అటనుండి గూడూరుకు. సత్తెనపల్లి. నరసరావుపేట మంగళగిరి. బొబ్బిలి – ఇత్యాది ప్రాంతములకు బదిలీ చేయబడెడి వారు. ఎంత దూరసుదూర ప్రాంతములకు బదిలీ చేసిననూ, ఉద్యోగ ధర్మ నిర్వహణలో ఎలాంటి పొరపొచ్చెములు, అవక తవకలు లేకుండ గడిపినట్లు స్పష్టము. స్వప్రయోజనముకొరకు ఏ ఉన్నతాధికారి మన్ననలకు ప్రాకులాడినట్లు కన్పించదు అటులనే కవితా జీవితమున గూడ, తన సాహిత్యప్రచారముకొరకు తన పేరు ప్రఖ్యాతులకొరకు ప్రాకులాడినట్లు కన్పించదు. అందువలననే తెలుగు సాహితీ లోకము వీరిని అంతగా గుర్తించలేదు

చాల గ్రంథాలయములలో వీరి రచనలు కన్పిస్తాయి. ఆనాటి 'భారతి' 'ఆంధ్రపత్రిక' ఉగాది సంచికలలో వీరి రచనలు ప్రచురితములు. వీరిరచన 'చకోరసందేశము' అను సందేశ కావ్యమును ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు డిగ్రీతరగతులకు ఆధునిక కవిత (Modern Poetry)గ నిర్ణయించిరి. సందేశ కావ్యములలో 'చకోర సందేశము' విశిష్ట స్థానమును సంతరించుకొనినది అయినను "వేంకటరావు గారు వెనుకటిరావుగారేగాని ముందటిరావు గారు కాదు కాలేదని" ఆచార్య యశస్వి యస్వీ, వారి ఆవేదనను కర్షకభారతము (Part I) ప్రథమభాగము పీఠికలో వ్యక్తీకరించిరి.

కాల మీ విధముగ గడచిపోయినది. వేంకటరావుగారు కీర్తిశేషులయినప్పటికి వారికి రావలసిన పేరు ప్రఖ్యాతులు లభించలేదు. ప్రచురణ పొందని వారి రచనలు ముద్రణకు నోచుకోలేదు.

ఇప్పటికయినా ప్రభుత్వమువారు, కవిగారి కవితా పటిమను, వారిరచనల విలువలను గుర్తించి అముద్రిత గ్రంథములకు ప్రచురణ భాగ్యం కలుగ జేస్తుందని ఆశిస్తాము.

యువ సాహితీలోకం— వారి రచనలను ఆదరించి వారి ప్రౌఢకవిత్వ తత్వాన్ని ఆఘ్రాణిస్తారని విమర్శకలోకం వారి కవిత్వంలోని గడుసు పోకళ్ళు, కవితాప్రౌఢిని. వారి ప్రయోగ విశిష్టతను ఆంధ్ర రసజ్ఞ పాఠకలోకానికి అంద జేస్తారని, ఆంధ్ర పరిశోధక మండలి వారి సాహిత్యపు తీరుతెన్నులను సమాలోచన చేస్తారని ఆశిస్తాము,

ఆకుల వి. పానకేశ్వరావు
హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్
యస్.వి. ఆర్. హెచ్. కాలేజి, నాగారం
గుంటూరు. (జిల్లా) ఆం. ప్ర. 5 2 2 268

# ప్రపంచ సామెతలు – భావ సమైక్యత

సామెతలేని మాట ఆమెతలేని విందు అన్న సామెతమీరు వినేయుంటారు. విందెన్నడూ జరుగని యిల్లు ఎలాంటిదో సామెతతో జతపడని మాట కూడ అలాగే నిరర్ధకమనిదాని భావం. అంటే సామెత మాటకు అందాన్ని, శ్రోతకాహ్లాదాన్ని కలిగిస్తున్నాయన్నమాటే కదా. మాట కందాన్ని కల్గించటంలో సామెలతకుండే సంక్షిప్తత, లయబద్ధత; ప్రాస, అంత్యానుప్రాస, ఛందో విధేయత మొదలైన లక్షణాలయితే శ్రోతకాహ్లాదాన్ని కల్గించటంలో సమయానికి సందర్భానికి తగినట్లుగా సామెతల కుండే హృదయా వర్జకమైన వ్యంగ్యాను భూతిని కల్గించే లక్షణమే ముఖ్యకారణం.

సామెతల్లో ఉండే యీ వ్యంగ్యాను భూతి యెట్టిది? అంటే యిది కావ్యాల్లో ఉండే రసధ్వని సిద్ధాంత మంత విశాలమైన విషయం. ఒక్కమాటలో చెప్పాలంటే కావ్యాల్లో "ధ్వని" వస్త్వలంకార రసరూపంగా ఉన్నట్లు సామెతలో వ్యంగ్యానుభూతి వ్యక్తియొక్క జీవితం, అతని చుట్టూఉండే సంఘం నేర్పినయనుభవాల సమాహార రూపంగా ఉంటుంది.

మానవునికి కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనేవి ఆతని అంతశ్శత్రువులు. శరీరం పంచ భూతాలతో నిర్మింపబడితే ఆతని మనస్సు పై యరిషడ్వర్గాలతో నిర్మింపబడిందేమో. ఈ శత్రువులతో మానవుడు నిత్యం పోరాటం సాగిస్తూనే ఉంటాడు. అప్పుడొక దొక సారిగెలుస్తాడు. మరొకసారిఓడిపోతాడు గెలుపోటములమాట ఎలా ఉన్నాయీసంఘర్షణలో నిత్యమాతడు ఎన్నొఅనుభవాలను పొందుంతాడు ఆయనుభవాలనాత దెన్నడు మరువలేడు. అట్టివన్ని యాతని ఆంతరంగిక యనుభవాలు.

సమాజం కూడ యిట్టి మానవుల కంటె భిన్నమైనది కాదు కదా కాబట్టి మానవుడు సమాజంలో మెలగేటప్పుడు మరో కొన్ని యనుభవాలను పొందుతాడు. ఇవి బాహిరమైన యనుభవాలు. ఇలా యనుభవాలు వ్యక్తిపరంగానైన-సమాజ పరంగానైన సమిష్టిమీద అన్నికూడ మానవ జీవితంలో నేర్చుకొన్న అనుభవపాఠాలే కదా. ఈ వ్యష్టి-సమిష్టి యనుభవాల సమాహారమే మానవ జీవితం. అదే సమాజ జీవనం క్రమంగా అదే జాతి చరిత్ర – సంస్కృతి.

మానవజీవితాన్ని-సహజజీవనాన్ని–జాతిచరిత్రసంస్కృతిని ప్రతిబింబింపజేసేదే సాహిత్యం. అయినాసాహిత్యంలోని ఏ ప్రక్రియని తీసికొని చూచినా వాటిని ప్రతిబింబింప చేసే ప్రయత్నం కొంతే జరిగినట్టు కనబడుతుంది కాని యీ ప్రయత్నం సామెతలలోనే ఫలవంతమౌతుంది. కారణం? సాహిత్యప్రక్రియలువేనిక వివేకకవికృతములు కానిసామెతలు అనుభవంపండి చెప్పిన యనుభవజ్ఞుల మహాకృతులు. అంతే కాదు. సాహిత్య ప్రక్రియలవలె ఎవరో కొద్ది మంది విజ్ఞానవంతులకే పరిమితం కావు. పండిత పామర సాధారణమైనవి పైగానివితాళపత్ర గ్రంథాల్లో ముక్కుతు మూల్గుతు జీవించినవికావు జవం–జీవంకల్గిన జనుల ఉపిరిలోఊపిరిగా ఉండి నిత్య నూతన జీవనాన్ని నింపుకొంటూ వారి రసనా (నాలుక) రంగంపై నాట్యమాడిన వాగ్దేవతయేయీసామెతలు.

అయితే యీ సామెతలు ఏదో ఒక భాషకు పరిమితమైన ఆస్తికాదు. ప్రపంచంలోని సమస్తభాషాజనులకు నివి ఉమ్మడి ఆస్తులు. భౌగోళికంగా ప్రాంతాలు వేరైనా– దేశాలు వేరైనా అప్పుడు-ఇప్పుడు–ఎప్పుడూఅంతట ఉన్నది మానవ జాతియేకదా. భౌతికంగా జాతి, మత, కుల, భేదాలెన్ని ఉన్నా మానవజాతి మనస్సులన్ని కామ–క్రోధ–మద-లోభ–మాత్సర్యాల కతతీమైనవి కావు అందుచేతనే

వెనుక చెప్పినట్లుగా వానివల్ల కలిగే ఆంతర–బాహిర అనుభవాలన్ని ఒక్కలాగే ఉంటాయి. ఈ యనుభవాలనే అద్దం పట్టి చూపించే సామెతలు ఏదేశంలోనైనా–ఏ భాషలోనైనా ఒకేరకంగా ఉంటాయనటం అతిశయోక్తి కాదు. విచిత్రమూ కాదు. నిప్పుపట్టుకొంటే కాలుతుంది. ఈ యనుభవం ఏ దేశంలోనైనా ఒకేరకంగా ఉంటుందికదా. అలాగే అన్ని యనుభవాలూ దేశ-భాషలతో నిమిత్తంలేకుండ ఒకేవిధంగా ఉంటాయి. చూడండి. వివిధ దేశాలలోని సామెతలను మీ ముందుంచుతాను. పరిశీలించండి.

త్రికరణశుద్ధిగా పరోపకారం చేసినవాళ్లకే అనేకకష్టాలు సమస్యలు ఎదురౌతూ ఉంటాయి. ఈ విషయాన్ని "కాచిన చెట్టుకే రాళ్లదెబ్బలు'' అని తెలుగు సామెత వివరిస్తోంది ఈ యనుభవం ఒక్క తెలుగు జాతికేకాదు ప్రపంచంలో ఎక్కడున్న సజ్జనునకు-పరోపకారికిఎదురయ్యేసమస్యయిది.

"కాయెందమరం కల్లడిపడుం" అని అరవసామెత పై విషయాన్ని యథాతథంగా అనువదిస్తే.

It is only the tree laden with fruits that people throw stones (FRENCH)

The best bearing trees are the most beaten (Italian)

అని ఫ్రెంచి–ఇటాలియన్ సామెతలు కూడ యీ విషయాన్ని యథాతథంగా వివరించాయి. ఇలాంటిదే మరియొకటి చూడండి.

ఒక కఠిన సమస్యనైనా మూర్ఖుడైన వ్యక్తినైనా ప్రారంభంలోనే వాటిని సరిచేయాలి. కాని కాలాతీతమయితే సరిచేయలేము. ఈ యనుభవాన్ని "చెట్టైవంగనిది మ్రానై వంగువా"అని తెలుపుతోంది తెలుగుసామెత.

"సెడియిలెవడాంగాదదుమరత్తిలె వణంగుమా'' అని అరవ సామెత..

1. Bend the tree while it is young (Italian)

2. The old branch breaks if bent (Danish)

3. Best to bend while its twig. (English)

అని ఇటాలియన్–డేనిష్ సామెతలు చెప్తున్నాయి.

పైరెండు ఉదాహరణలనుబట్టి అవి ఒకటి మరియొకదానికి భావానువాదాలుకాక యథానువాదాలన్న విషయం స్పష్టంకాకమానదు. భారత దేశంలోని ప్రాంతీయ భాషలలోని సామెతలకు ఖండాంతరాలలోని భాషా సామెతలు అచ్చుగ్రుద్దినట్లు ఎలా అనూదితాలయినవి ? అనే సందేహం రాకమానదు. ఈ సమస్యకు సమాధానం చెప్పటమంత సులభమైన పనికాదు. కాని మానవజాతి ఎక్కడున్నా వారికి కలిగే అనుభవాలన్ని ఒకేరకంగా ఉంటాయని నా ఉద్దేశ్యం. కారణం మానవులంతా ఒకటేకాబట్టి. ఈ నా యభిప్రాయానికి మరికొన్ని సామెతలను చూపుతాను. గమనించండి.

1. కట్టిన యింటికి కణుకులు చెప్పేవారు వెయ్యిమంది. (తె సా)

కట్టవీటుక్కు ఎట్టువక్కణై. (తమిళసామెత)

He that buildth upon the high way hath many advises. (Dutch)

2. పేదవానికోపం పెదవికిచేటు. (తె. సా)

బడవనకోప అవుడిగెమారి (కన్నడ సామెత)

Anger with out power in fooly. (German)

2. అశుద్ధముమీద రాయివేస్తే ముఖాన పడుతుంది. (తె. సా)

If you will stir up the nire you must bear the smell,

Maddle with dirt and some of it will stick to you. (Danish)

4. నాకోడి కుంపటి లేకపోతే ఎలాగు తెల్లవారుతుంది.

Day light will come though the Cock does not crow. (Danish)

5. ఉమ్మడి గొడ్డె పుచ్చిచచ్చింది. పొత్తుల మొగుడు పుచ్చి చచ్చాడు. (తె. సా)

The ass that common property
is ways the worest sadded
(French)

The ass of many owners is
eaten by wolves (Spanish)

6. ఏ గాలికాచాప ఎత్తినట్టు. యే యెండకాగొడుగు పట్టినట్టు. (తె. సా.)

Set your sail according to the
wind. (French)

7. కూన అని పెంచితే గండయి కరవవచ్చింది
(తె. సా)

Foster a reven and it will peck
out your eyes. (Spanish)

8. గట్టుచేరాక పుట్టివానితో పోట్లాడినట్లు. (తె. సా)

The river past the saint for-
gotten, (Spanish)

9. గడ్డంకాలి ఒకడు ఏడుస్తుంటె చుట్టకు నిప్పుఇమ్మని వెంబడించినట్టు (తె. సా)

If my beared is burnt other
stry to light their pipes. at it
(Turkish)

10 పుట్టినవాడు గిట్టక మానడు.
పుట్టినప్పుడే గిట్టే వ్రాత వ్రాసాడు.

As soon as *man* is from he beg-
ing to die. (German)

ఇలా వ్రాసి కొంటూ వి తే చాలా ఉన్నాయి. ఇవి ఒక దాని కొకటి యధాను వాదాలుగా ఉన్నాయనడంలో నెట్టి సందేహమూ లేదు కదా. ఇలా కొన్ని యధాను వాదాలు ఉంటే మరికొన్ని భావానువాదాలుగా ఉంటాయి. వీనికొక్క ఉదాహరణను చూపుతాను.

''లేని బావకంటే గుడ్డి బావమేలు'' ఈ తెలుగు సామెత కుసమాంతరంగా Better a blind horse than an empty halter అనే దచ్చి సామెత కనబడుతుంది. ఇక్కడ ''బావ'' అనే మాటకు horse అనేమాట; గుడ్డి బావఅనేమాటకు empty Halter (కళ్లెం) అనేమాట కనబడుతున్నా ఆసామెతల వెనుక ఏది లేని దానికంటె ఏదో ఒకటి ఉండటం మంచిది. Some thing is better than nothing అనే అంతరార్థం మాత్రమొక్కటే. అయితే ఆ సామెత పుట్టే దశలోని సందర్భము – కాలము– దేశము – వ్యక్తులు. వీనియాధారంగా మాటలు – వస్తువులు యీ విధంగా భేదిస్తాయి కాని వాని వెనుక నుండే వ్యక్తుల అనుభవాలు మాత్రమొకే విధంగా ఉంటాయి. అందుచేత నే యధాను వాదాలైన సామెతలకంటె భావాను వాదాలైన సామెతలనేక భాషలలో కన్పిస్తాయి.

అయితే సామెతలను కొన్ని భావాను వాదాలుగా మరి కొన్నింటిని యధాను వాదాలుగా ఎవరో కొంత కూర్చుని వ్రాసారని నా భావం కాదు. భౌగోళికంగ ఏర్పడ్డ ప్రాంతం రాష్ట్రం –దేశం–ఖండం అనే ఎల్లలు; మానవుడు నిర్మించు కొన్న జాతి – మతం – కులం అనే పరిధులు చెరిపివేసి చూస్తే అన్ని కాలాల్లో ఉన్నది. మానవ జాతేకదా. సుఖ దుఃఖ సమ్మేళితమైన జీవితం మానవజాతి కంతకు ఒకే విధంగా ఉంటుందని యూహించటంలో దోషమేమీ లేదు. అందుచేతనే మానవజీవితాన్ని ప్రతిబింబింపచేసే సామెతలు యధానువాదాలుగా – భావానువాదాలుగా ఉన్నాయనటంలో అతిశయోక్తి గాని – వైచిత్యంగాని లేదు. అని నాఉద్దేశ్యం నా ఉద్దేశ్యానికి హేతువులైన మరి కొన్ని భావానువాద సామెతల్ని మీ ముందు ఉంచుతాను.

1. అమ్మ పెట్టేవి నాల్గు పెడితేగాని అత్తవారింటికి వెళ్ళ నన్నదట.

There is no argument like that
of the stick (Spanish)

2. ఇఘంటరమ్మంటె ఇల్లంత చేకొన్నట్లు (తె. సా.)
ఇడుం కుడుతాల్ మఠం పిడుంగువాన్ (తమిళ సా)

Give him an inch he will take
amell (English)

3. గుమ్మడికాయ దొంగ అంటె బుజాలు తడుము కున్నట్టు. (తె. సా)

కుమ్మడికాయకళ్ల అందరెహెగలు మట్టినోడిద హాగె. (కన్నడ. సా)

He that has a big nose thinks every one is speaking of it.

(Scotch)

4. ఉయ్యాలలో పిల్లను పెట్టుకుని ఊరెల్లవెతికినట్టు.

He looks for his ass and sits on his back (French)

5. ఆవగింజ అట్టెదాచి గుమ్మడికాయ గుల్లగా ఎంచే వాడు.

Panny wise and pound foolish

(Greek)

6. కుక్కనందల మెక్కిస్తే అమేధ్యమునుచూచి దిగనురికింది.

Set a frong on a golden stool and off it hopes agains into the pool. (German)

7. కాశీకి పోగానే కట్టికుక్క గంగిగోవు అవుతుందా ?

He that goes a beast to Rome a beast returns. (Italian)

8. ఒకొక్కరాయి తీస్తుంటే కొండైనా తరుగుతుంది.

Drop by drop the take is draived. (Latin)

9. అత్తా ఒకంటి కోడలే.

The mother in law forgets that she was a daughter-in-law.

(Spanish)

10. తన కాళ్లకు బందాలు తానే తెచ్చుకున్నట్టు.

He brings a staff to break his ownhead. (Stotch)

సామెతలన్ని అనుభవాలకు సంబంధించినవి మాత్రమే కావు. కొన్ని కొన్ని నమ్మకాలకు కూడ సంబంధించినవి కూడ ఉన్నాయి. నమ్మకమనగానే అందరు విధిగా నమ్మాలని నియమమేమీలేదు కాని దేశ–కాల-మాన–పరిస్థితులను బట్టి వ్యక్తులకు కొన్నికొన్ని నమ్మకాలు కలగటంసహజం. అలా కలగరాదని కూడ ఎవరూ శాసించలేరు. అయితే ఒక వ్యక్తికి కల్గిన నమ్మకాలే సమాజంలో మరి కొంతమందికి కూడ కలగటంలో ఆశ్చర్యముకూడ లేదు. అయితే వ్యక్తి యొక్క అనుభవాలు సమాజపరంగా మారి సామెతలుగా మారతాయి. కాని యీ సామెతలలోని విషయాలకు ఊహ–నమ్మకం–అనేవే ప్రమాణాలుగాని సార్వత్రిక సత్యాలుగా మాత్రం గ్రహించరాదు. అలాగ్రహించడానికి తగినన్ని హేతువులీ సామెతలలో కనబడవు. ఇలా నిర్హేతుకమైన నమ్మకాలు ఏ దేశంలోని వారికైనా కలుగుతూ ఉండటంలో ఆశ్చర్యమేమీ ఉండదుగాని ఖండఖండాంతరాలలోని ప్రజలకందరకు ఒకేరకమైన నమ్మకాలు కల్గడమే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ విషయ మొక్కటియేచాలు మానవులంతా ఒకటే అని చెప్పడానికి. దీనికి కొన్ని సామెతలను పరిశీలిద్దాం.

బ్రాహ్మణులు ఎఱ్ఱగా–గాని తెల్లగాని ఉంటారు, అలాగే మాలమాదిగలు నల్లగా ఉండటం సహజం, ఈ రంగులకు భిన్నంగా ఉండే వారిని నమ్మరాదంటు.

1. "నల్లబ్రాహ్మణ్ణి – ఎఱ్ఱమాదిగను నమ్మరాదు" అని చెపుతుంది సామెత.

ఇందులో సత్యం కంటె ఊహ – నమ్మకమే ప్రాధాన్యం వహిస్తుంది ఇలాంటి సామెతే,

**Beware of red Italian, White French man and a black German (English)**

అనే ఇంగ్లీషు సామెత ఉంది. పై సామెతలో చెప్పబడిన శరీర వర్ణము గల ఇటాలియనులు ఫ్రెంచివారు. జర్మనీ వారు దుర్జనులని గట్టిగా చెప్పగలమా?

2. ఇలాంటిదే మరొక దాన్నిచూడండి ఎడ్చేమగాడిని నవ్వే ఆడదాన్ని నమ్మరాదు" మగవాడికి ఏడ్పురాకూడదనా? ఆడది నవ్వరాదనా? ఈ సామెత ఆంతర్యం. ఎడ్చే మగవాడు పౌరుషహీనుడని భావించిన నవ్విన ప్రతి ఆడది వ్యభిచారి అనలేము కదా? అందుకనే ఇలాంటి వానిలో సత్యం పూజ్యం నమ్మకం రాజ్యం ఉంటాయి. ఇల్లాటిదే ఇంగ్లీషులో కూడ సామెతను చూడండి.

A whistling girl and Crowning hen will come to no good end. (English)

ఇలాంటిదే మరి యొకటి.

3. ఆవులింతకు అన్నదమ్ములున్నారుగాని తుమ్ముకు తమ్ముడైనా లేడు.

yawning is synepathelic, Sneezing is not. (French)

ఈ విధంగా విభిన్న భాషలలోని సామెతను అధ్యయనం చేస్తే ఆచారాలు – సంప్రదాయాలు – ఊహలు – అనుభూతులు – భక్తి – రక్తి – ఆధ్యాత్మిక భావనలు – శాస్త్ర విషయాలు సిద్ధాంతాలు, వైజ్ఞానిక విషయాలు ఇలా అనేక విషయాల్లో ప్రపంచ మానవుల భావసామ్యత దృగ్గోచరమౌతుంది. అందుచేతనే సామ్యత శబ్దభావమే సామెత అని చెప్పిన కీ॥ శే॥ డా. చిలుకూరి నారాయణరావు గారి మాట ఎంతో దూరదృష్టితో కూడినది.

కులమత జాతిభేదాలతో - ప్రాంతీయ దేశీయ దురభిమానాలతో సమైక్య భావనకు భరతవాక్యం పలుకుతున్న నేటి ప్రపంచమానవాళికి ప్రపంచ మానవ సమైక్య భావసామ్యతను నిరూపిస్తూ అన్వర్థకములైన ప్రపంచ భాషల సామెతలను సమగ్రంగా క్రోడీకరించి విశ్వైకకుటుంబ భావనకు నాంది పలుకవలసిన ఆవసరమెంతైనా నేడుంది.

*సంప్రదించిన గ్రంథాలు*


1. Everyman's Dictionary of Quatotion and Proverbs. Compiled by D. G. Bowning, in 1951
2. తెలుగు సామెతలు. సాహిత్య అకాడమీ హైదరాబాదు.
3. A selection of Telugu Proverbs By Captain M.W. Carr. Madras Staff Carps.

# వార్తావాహిని

## ప్రమాణపత్ర వితరణోత్సవము

జూన్ నెల 12వతారీఖున సీతాఫల్‌మండి సికింద్రాబాదునందు రాష్ట్ర భాషా వికాస సమితిచే నడుపబడు చున్న శరత్ హిందీ మహా విద్యాలయము నందు ప్రమాణపత్ర వితరణోత్సవము జరుపబడినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హిందీ విద్యాశాఖాధికారియైన డా॥ సాయిలుగారు ముఖ్య అతిథిగా విచ్చేసిరి, వైదిక విద్యాలయ ప్రధానోపాధ్యాయులు శ్రీ ముద్దు కృష్ణగారు, కార్యదర్శి శ్రీ సత్యనారాయణ గారు కూడా దేశఐక్యతకై హిందీ నేర్చుకోవలసిన ఆవశ్యకతను గురించి నొక్కి చెప్పిరి.

ప్రమాణ పత్ర వితరణ తరువాత హిందీ విద్యాలయము ప్రిన్సిపాల్ శ్రీ ఎమ్ రఘుపతిగారు వందన సమర్పణ, జాతీయ గీతముతో సభ ముగిసినది.

### భారతీ హిందీ మహావిద్యాలయం మచిలీపట్నం వార్షిక మహాజనసభ

ది. 18-5-84 సాయంత్రం గం 6.30ని॥ లకు స్థానిక వివేకానంద మందిరంలో శ్రీ సి. యల్. నరసయ్యగారి అధ్యక్షతన భారతీ హిందీ మహా విద్యాలయ సర్వ సభ్య సమావేశము జరిగినది ముఖ్య అతిథి గా॥ డా॥ బి. ధన్వంతరి ఆచార్య సభలో పాల్గొనిరి.

తొలుత హిందీ విద్యాలయ కార్యదర్శి శ్రీ చలమల శెట్టి శేషగిరిరావు హిందీ విద్యాలయ నివేదికను సభకు సమర్పించి, ప్రగతిని వివరించిరి. ముఖ్య అతిథి డా॥ బి ధన్వంతరి ఆచార్య భారతీ హిందీ విద్యాలయం వంటి భాషా, సాహిత్య సాంస్కృతిక సంస్థలకు స్థానిక ప్రజలు అన్ని విధముల సహకరించదగునని, తానుకూడ తాగు విధముగా సహకరించగలనని హామీ యిస్తూ విద్యాలయ ప్రగతికి శుభాకాంక్షలు తెలుపుచూ మాట్లాడిరి. శీతలపానీయములారగించుటతోసభ ముగిసినది.

## శ్రీ సాయినాథ్ హిందీ విద్యాలయం ఒంగోలు

ప్రకాశంజిల్లా ఒంగోలు పట్టణములోని శ్రీ సాయి నాథ్ హిందీ విద్యాలయము ద్వితీయ వార్షికోత్సవము 29-7-84 ఆదివారం స్థానిక సంతపేట సంస్కృత పాఠశాల ఆవరణలో సాయంత్రం 4గం॥లకు జరిగినది. విద్యాలయ బ్రాంచి మేనేజరు "శ్రీ పి. వెంకటశర్మ" సభికులకు ఆహ్వానించగా, నాటి సభకు శ్రీ డి. కామేశ్వరరావు ఎమ్. ఏ. గారు (సాహిత్య సదన్, ఒంగోలు) అధ్యక్షతాసనము గ్రహించిరి. ప్రార్థనా గీతగా॥ అనంతరము శ్రీ డి కామేశ్వరరావు గారిని, మరియు శ్రీ కే. వీరభద్రరావు, హిందీ ప్రచారక్ (సంచాలక్, హిందీ ప్రేమిమండలి, ఈతముక్కల) గార్లను, నూతన ఖాదీవస్త్రములతో సన్మానించిరి.

శ్రీ డి. కామేశ్వరరావుగారు తమ అధ్యక్షోపన్యాసములో "హిందీ భాషను కేవలం, పరీక్షా దృష్టితోగాక, సాహిత్య పరంగా నేర్వాలి. ఈరోజు

లలో హిందీ ప్రచారం తీవ్రమగుచున్నది. ప్రతి విద్యార్థి తాను నేర్చుకొనుటయేగాక కనీసం 10మందికి నేర్పే ప్రయత్నం చెయ్యాలి అని వక్కాణించిరి.

విద్యాలయ ప్రధానోపాధ్యాయిని, శ్రీమతి పి. వెంకటసుబ్బమ్మగారు వందన సమర్పణ గావించిరి రాష్ట్ర గీతముతో సభ ముగిసినది.

## హిందీ ప్రారంభిక పరీక్షల ప్రమాణపత్ర వితరణోత్సవము పామిడి

ప్రభుత్వ జూనియర్ కళాశాల, పామిడి యందు, దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి ఆగష్టు 88 ప్రారంభిక పరీక్షార్థుల ప్రమాణ పత్ర వితరణోత్సవము ది. 2-9-84 జరుపబడినది ప్రార్థనానంతరము హిందీ ప్రచారకులు శ్రీ ఏ. బి. ఉమాశంకర్ గారు అతిథులకు స్వాగతము పలుకుచూ సభా విశిష్టతను గూర్చి పలికిరి.

సభకు శ్రీ ఆర్. శంకరనారాయణ బి.ఎ బి.ఇ.డి. హెడ్మాష్టర్‌గారు (జడ్. పి. హెచ్. స్కూల్. కల్లూరు) అధ్యక్షత వహించిరి. వారు తమ వుపన్యాసంలో మన భారతదేశమునకు స్వతంత్ర జాతీయ భాష అవసరమని, అన్ని భాషలకు మాతృక ఆయిన సంస్కృతము నుండి హిందీ భాష జన్మించినదని, అట్టి జాతీయ భాష హిందీని మనము తప్పక అభ్యసించవలెనని నుడివిరి.

అధ్యక్షులవారు విజేతలైన పరీక్షార్థులకు ప్రమాణ పత్రముల నొసంగిరి.

వందన సమర్పణ తర్వాత జాతీయగీతంతో సభ ముగిసెను.

## హిందీ పరిచయ్ మౌఖిక పరీక్షా ప్రమాణపత్ర వితరణోత్సవము భీమునిపట్నం

స్థానిక సి. బి. యం. ఉన్నత పాఠశాల, భీమునిపట్టణమునందు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర, హైదరాబాద్ స్వర్ణజయంతిని పురస్కరించుకొని నిర్వహించబడిన (ఏప్రెల్ 84లో) హిందీ పరిచయ మౌఖిక్ పరీక్షా ప్రమాణ పత్ర వితరణోత్సవం తేదీ 28-7-1984 న జరిగినది.

ఎం. వి. యల్. కామేశ్వరరావు అతిథులకు స్వాగతము పలుకుచూ, దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర, హైదరాబాద్ స్వర్ణజయంతి విశిష్టతను, హిందీ పరిచయ్ పరీక్షల ప్రాముఖ్యతను గూర్చి విపులంగా విన్నవించిరి.

సదరు సభకు శ్రీ పి. న్యూటన్, ప్రధానోపాధ్యాయులు మరియు కరస్పాండెంటు, సి. బి. యం. ఉన్నత పాఠశాల, భీమునిపట్నం వారు అధ్యక్షత వహించుటయేగాక ఉత్తీర్ణులైన విద్యార్థులకు హిందీ పరిచయ పరీక్షా ప్రమాణ పత్రములను అందజేసిరి.

చివరగా జాతీయగీతంతో సభ సమాప్తమైనది.

## శ్రీశారదా హిందీ విద్యాలయము విజయవాడ

ది 9-8-84 సాయంత్రము 4 గంటలకు వివేకానంద హైస్కూల్‌కు అనుబంధమైన శ్రీ శారదా హిందీ విద్యాలయ పరీక్షార్థుల వీడ్కోలు ఉత్సవం శ్రీ మిక్కిలినేని సుబ్బారావు ప్రిన్సిపాల్, హిందీ ప్రచారక విద్యాలయము విజయవాడ అధ్యక్షతన జరుపుకొనబడినది ఆదే పాఠశాల కరస్పాండెంట్ శ్రీ పి. బాపిరాజు M. Com L.L.B గారు ముఖ్య అతిథిగా విచ్చేసిరి

శ్రీ కే. నాగేశ్వరరావు సాహిత్య రత్న గారి ప్రార్థన గీతముతో నాటి సభ ప్రారంభించబడినది. వివేకానంద హై స్కూల్ ప్రధానోపాధ్యాయులు శ్రీ యస్. నరసింహమూర్తి B A. B EDగారు సభికులకు స్వాగతము పలికిరి.

ముఖ్య అతిథులు శ్రీ బాపిరాజుగారు హిందీ నేర్చుకొనవలయునని-హిందీ నేర్పవలయునని తమ ఉద్దేశ్యమును తెలియపరచిరి. హిందీ తరగతుల నిర్వ

ణలో విద్యాలయ ఉపాధ్యాయులు శ్రీ కే. నాగేశ్వర రావుగారి కృషికి అభినందించిరి.

అధ్యక్షులు మరియు అతిథులు పరీక్షార్థులను ఆశీర్వదించి ప్రమాణ పత్రములను ప్రదానము చేసిరి.

శ్రీ శారదా హిందీ విద్యాలయమున వ్రాత పరీక్షలలో ఎక్కువ మార్కులు పొందిన పరీక్షార్థులకు బహుమతి ప్రదానము గావించిరి.

జాతీయ గీతముతో ఆనాటి కార్యక్రమము జయప్రదముగ ముగిసినది.

## హిందీ విద్యానికేతన్. విశాఖపట్నం

15-8-84 తేదీన అనగా స్వాతంత్ర్య దినము సందర్భములో హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము "హిందీ విద్యానికేతన్" లో జరిగినది. సభకు ముఖ్య అతిథిగా ఆంధ్రా యూనివర్శిటీ ప్రొఫెసర్ వి. పి. ఎల్. రావుగారు విచ్చేసి హిందీ భాషాభివృద్ధిని గురించి వివరించిరి. ప్రమాణ పత్ర వితరణ తరువాత సాంస్కృతిక కార్యక్రమము జరిగినది. శ్రీమతి ఉషా రాణి వందన సమర్పణ చేసిరి. జన గణ మన గానముతో సభ ముగిసినది.

## పుష్పకిరీటి శ్రీ పైడిపాటి

విజయవాడ రోటరీ క్లబ్బువారు 20-8-84న కవి సమ్రాట్ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి గారిని పుష్ప మకుటంతోనూ, కాశ్మీర శాలువాతోనూ. సన్మానించారు. సభకు, రోటరీ అధ్యక్షులు డాక్టర్ జంధ్యాల శంకర్ అధ్యక్షత వహించారు.

పి. వి. సత్యనారాయణ మూర్తి గారు, శాస్త్రి గారి రచనలను గూర్చి పరిచయం చేశారు. వాగ్దేవు గిరిజా దేవి "త్రిలింగదేశం మనదేనోయ్" అనే శాస్త్రి గారి గీతాన్ని గానం చేశారు. శాస్త్రి గారు పద్య రూపంలో కృతజ్ఞతను వెల్లడించి తమ నృత్య భారతిలో దశావతారాలను గానం చేశారు. హనుమాన్ గుప్త గారు వందన సమర్పణం చేశారు, సభకు పెక్కురు కవి పండితులు విచ్చేశారు.

## హిందీ మహావిద్యాలయము, గాంధీ పర్వతము విజయవాడ - 1

## హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము

15-8-1984 తేదీ ఉదయము 8 గం॥ల 30 ని॥లకు గాంధీ పర్వతము మీద జాతీయ పతాక వందన కార్యక్రమము జరిగినది. ప్రముఖ స్వాతంత్ర సమర యోధులు గాంధీ పర్వత సంస్థ కోశాధ్యక్షులు డా॥ శ్రీ దమ్మాల పాటి రామారావు గారు జాతీయ పతాకాన్ని ఎగురవేశారు.

ఈ సందర్భముగా జరిగిన సభలో హిందీ మహా విద్యాలయం ప్రిన్స్‌పాల్ చర్ల జనార్థనస్వామి విద్యాలయం రిపోర్టును వివరించారు జరిగిన హిందీ ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారికి ప్రమాణ పత్రములు, స్వాతంత్ర్య దినోత్సవ సందర్భములో నిర్వహించ బడిన "క్విజ్" లోనూ, హిందీ ఉపన్యాస పోటీలలోనూ. గెలుపొందిన వారికి డా॥ శ్రీ రామారావు గారు బహుమతులను ప్రధానం చేసి విద్యార్థులను ఆశీర్వదించిరి. వందన సమర్పణానంతరము కార్యక్రమము జన గణ- మన గీతముతోముగిసినది.

## నెహ్రూ హిందీ విద్యాలయం, కాకినాడ

## ప్రమాణ పత్ర వితరణోత్సవము

ది 15- 8-84 సాయంకాలము ప్రమాణపత్ర వితరణము జరిగినది. విద్యాలయ ప్రిన్సిపాల్ కె సుబ్రహ్మణ్యంగారు టి. వి. రాఘవేంద్రరావు అధ్యక్షులు నాళంనరసింహా రావు (హిందీ లెక్చరర్)వి. వి. సూర్యనారాయణ (హిందీ పండిట్) ఎ. వి. రావు (ప్రిన్సిపాల్ ఆ. ప్ర. వె. త. ఆ పాఠశాల, కాకినాడ) చిరట్ల నాగరాజు (లాండ్ లార్డ్) గారిని సభకు ఆహ్వానించిరి. ప్రార్థన గీతముతో సభ ప్రారంభమైనది. టి. వి. రాఘవేంద్ర రావు గారు హిందీ ప్రాముఖ్యతను గూర్చి ప్రసంగించిరి.

1984 ఫిబ్రవరి హిందీ ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు నాళం నరసింహా రావు గారు ప్రమాణ పత్ర ప్రధానము చేసిరి.

జన గణ మన జాతీయ గీతముతో సభముగిసినది.

# కీ. శే. శీర్ల బ్రహ్మయ్య గారి కాంస్యవిగ్రహ నిర్మాణ కమిటీ



స్వర్గీయ శ్రీ శీర్ల బ్రహ్మయ్య కాంస్య విగ్రహ కమిటీ అధ్యక్షులు శ్రీ వంకినేని రాఘవేంద్ర రావు అంగీకారంతో వివిధ ప్రత్యేక కమిటీ వివరాలను కమిటీ ప్రధాన కార్యదర్శి పటగర్ల రామమోహన రావు ప్రకటించారు

గౌరవ అధ్యక్షులు : శ్రీ మాగంటి రవీంద్రనాధ్ చౌదరి (జిల్లాపరిషత్ అధ్యక్షులు) అధ్యక్షులు శ్రీ వంకినేని రాఘవేంద్రరావు, ఉపాధ్యక్షులు; డా॥ చెన్న కేశవుల రంగారావు (శాసనసభ్యులు) శ్రీయుతులు రావుగోపాల్ ఉనాని లింగమల్లు శ్రీరాంప్రసాద్ కట్టా పూర్ణానందరావు నూతులపాటి శ్రీహరిరావు అప్పర ధర్మారావు చిట్టిబొమ్మ రంగారావు, కోగాడ నరసింహా రావు గుడివాక నమశ్శివాయ నందిగం సత్యనారాయణ శిరిపలి ధర్మారావు సామంతుల వెంకటేశ్వరరావు కోశాధికారి : నరహరిశెట్టి నాగేశ్వరరావు ప్రధాన కార్యదర్శి : శ్రీ పటగర్ల రామమోహనరావు కార్య దర్శులు : శ్రీయుతులు నంది బాలసత్యనారాయణ పంచకర్లవెంకటేశ్వరరావు, అల్లంకికోటి సాంబశివరావు శ్రీమతి శింగినీడి సరస్వతి కార్యవర్గసభ్యులు శ్రీయుతులు పచ్చిపులుసు సత్యనారాయణ రంభా వెంకట ప్పయ్య ''లవా సూర్యనారాయణ నలబాటి సూర్య ప్రకాశరావు చింతా సోమరాజు కాపా వాసుదేవరావు

నేరెళ్ల రాజా పూడి అప్పలస్వామి అలమిల్లి నరసింహా రావు శీతంరాజు గిరిధరగోపాల్ చప్పిటి గంగాధర రావు మారిశెట్టి ప్రసాదరావు భీమవరపు అప్పారావు పోతుకూచి రామజోగేశ్వరరావు మేకా నాగభూషణం పటగర్ల వెంకటేశ్వరరావు పిన్నింటి సత్యనారాయణ వెత్సా పాండురంగారావు డా. వై. సాంబశివరావు డా॥ సుంకర సత్యనారాయణ కొత్త వెంకటసుబ్బా రావు పసుపులేటి కృష్ణారావు ఎ. ఎస్ ఎస్. రామా రావు చెన్నా రామచంద్రరావు ముద్దుల కాశీ విశ్వనాథం తన్నీరు కృష్ణమూర్తి దొండా రామారావు కొట్టు అప్పా రావు శీర్ల తేజో భాస్కరరావు బావశెట్టి రామకృష్ణ పులి వెంకట సత్యనారాయణ ఎస్. పి. రావు బి. వి. ఎస్. భాస్కరరావు బాబాయి శీరం నరసింహా రావు జగన్‌మోహనరావు డా॥ వై. వి. రాఘవరావు పయా వుల గోపాల్ కొట్టు సత్యనారాయణ దారపు సూర్య నారాయణ దొంతంశెట్టి విశేశ్వరరావు కమ్ముల కృష్ణ మోహన్ మాజేటి నరసింహారావు జి. కోటయ్య కానాల గురుమూర్తి.

సభా సంఘం : శ్రీయుతులు వీరమాచినేని వెంకట నారాయణ, కొమ్మారెడ్డి సత్యనారాయణ ఎస్. కె. వి. కృష్ణావతారం, కె. వి. ఆర్ ఎస్. బాలసుబ్బారావు, అమనగంటి శ్రీరాములు, ఆముదాల అప్పలస్వామి, నరహరిశెట్టి సూర్యనారాయణ కమ్ముల సుబ్బయ్య ఆడిటర్ గ్రంధి శ్రీహరిరావు.

సారధ్య సంఘం : శ్రీయుతులు మోతే శ్రీనివాస నారాయణరావు కట్టా పూర్ణానందరావు, లింగమల్లు శ్రీరామ ప్రసాద్, కూనపరేడ్డి రామకృష్ణారావు అలవా సూర్యనారాయణ శ్రీమతి అబ్బూరి రాజ్యలక్ష్మి.

ఉత్సవ కమిటి : శ్రీయుతులు మురాల వెంకటే శ్వరరావు రాళ్ళపల్లి సూర్యనారాయణ, కమ్ముల హరిబాబు మాలే శ్యామలరావు తన్నీరు హరిబాబు చాగంటి రాధాకృష్ణమూర్తి పోతరాజు, కర్రి నాగేశ్వర రావు పటగర్ల సుబ్బారావు, కందుల అప్పలరాజు.

సావనీర్ కమిటి : పుష్పాల సూర్యనారాయణ, కర్రి అప్పారావు, మోదుగు కృష్ణారావు చోడిశెట్టి శ్రీరామచంద్రరావు పెదపాటి హనుమంతరావు.



(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు)



పేరు : కత్తివెంటి మహాలక్ష్మి

వృత్తి : హిందీ పండితులు

కార్యక్షేత్రం : గుడివాడ

అర్హతలు : రా. భా. ప్రవీణ,

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి

చిరునామా : 15/41, పార్కు రోడ్, గుడివాడ 521 301 కృష్ణా జిల్లా



పేరు : యేరువ బ్రహ్మారెడ్డి

వృత్తి : హిందీ ప్రచారం

కేంద్రము : గన్నవరం

అర్హతలు : హిందీ పండిట్.

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి

చిరునామా C/o ఆదర్శ హిందీ విద్యాలయం, దావాజీగూడెం, అల్లాపురం (పోస్టు), గన్నవరం ॥తా॥ కృష్ణా జిల్లా.



పేరు : శ్రీమతి న్యాయపతి జ్యోతి

కేంద్రం : విజయనగరం

వృత్తి : హిందీ పండితులు

అర్హతలు : బి.ఎ. బిఇ.డి, సా. రత్న

అభిరుచి : హిందీ సాహిత్యసేవ, హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి.

చిరునామా : ప్రిన్సిపాల్, హిందీవిద్యాలయం, గురాచారివీధి, విజయనగరం



గోదా తిరుమలయ్య

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్రకు ది. 22-8-84
నుండి నూతన కార్యదర్శిగా నియమితులైనారు.

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hind Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500004.